# అపరాధి యెవరు?

కర్త: కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారు

ప్రాచ్యపాశ్చాత్య విద్యాసాంప్రదాయముల భేదములను, సనాతన అధునాతన నియమములయందలి మంచిచెడ్డలను అద్దమువలె చూపగల సాంఘికనవల! కథానాయికయైన శారద పాశ్చాత్యవిద్యాభిలాషిణియై స్వధర్మత్యాగ మొనర్చి, మాతృదేవతాహితోక్తులు పెడచెవిని బెట్టి సకలకష్టములనుభవించి తుదకు, సనాతన బాలికావిద్యాలయాధికారిణియై సత్కీర్తి గాంచినది. ఇట్టి కుమార్తెను పాశ్చాత్యశిక్షాప్రణాళికలో ప్రవేశపెట్టిన గిరిజాశంకరుడు అపరాధియా? భర్తమాటకెదురాడలేక ఉపేక్షించిన తల్లి మహామాయాదేవి అపరాధినియా? భార్యాసౌందర్యమున ముగ్ధుడైన ప్రభాకరుడు అపరాధియా? వీరిలో అపరాధి ఎవరు? పాఠకులే నవలను సాంతముగా చదివి నిర్ణయింపుడు. వెల 0—12—0

# బందిపోటు దొంగ

కర్త: కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారు

ఇది రహస్య ఘటనాసమేతమయిన పరిశోధక నవలారత్నము. గోపాలరావు మధుసూధనరావుగారి కంపెనీ రొక్కమంతయు బందిపోటుదొంగ పాలయినది. పైగా ప్రాణాపాయము ప్రాప్తించినది. దొంగయైన కాలూరాయి పేరు గ్రామస్థులకు సింహస్వప్నమయినది. ఒక రహస్యమునకు మూడు రహస్యములు! ఒక కాలూరాయితో ముగ్గురు కాలూరాయి నామకులు!! అసలు కాలూరాయి యెవరు? అపహృతమయిన ఆస్తి యేమయినది? మధుసూదనుని మర్యాద యెట్లు నిల్చినది? పత్రికద్వార రహస్య మెట్లు ఛేదింప బడినది? స్వయముగా చదివి గ్రహింప వలసినదే. వెల 0—12—0

వలయువారు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# పచ్చబొట్టు

(అపరాధ పరిశోధక నవల)

[illegible]

సాయం వెంకటరావు



పబ్లిషర్సు

కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్

ప్రొప్రయిటర్సు, సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ.

1938

 [వెల 0-12-0

మొదటి కూర్పు 1000 ప్రతులు

## హెచ్చరిక



ఉషా ముద్రాక్షర శాలయందు
ముద్రింప బడినది.

# పీ ఠి క

ఆంధ్రసోదర సోదరీరత్నములార!

నేనీచిన్న పాత్రమును నిష్పాండిత్యముతో రచియించితినని గినియకుడు. ఇది నా ప్రథమోద్యమముగావున లోపముల నేకము లుండవచ్చును. అట్టిలోపములను సవరించుశక్తి ప్రథమముననే కలుగ నేరదు. ఒకబాలుడు తన శైశవమున నిర్భయముగా నడువ నేరక తప్పటడుగుల నిడుటకు ప్రారంభించును. అట్టి పసికందును మనము ప్రోత్సహించి సహాయమొనర్చి నంతసింప జేసిన నాబాలుడు క్రమ ముగా తనయుద్యమములో గట్టివాడై యితరులనే పరిహాసమాడ గలశక్తిసామర్థ్యములను బడయును గాన వానిలోపములను సవ రించి, మంచంతవానిగాజేయు బాధ్యత పెద్దవారలమగు మనకెట్లు గలదో ఆరీతినే తప్పులతడకలనితోచు పాత్రములను నిరసింపక ఒప్పులుగాజేయు బాధ్యత పండితశేఖరులకు గలదని నాబోటిపామ రుని అభిమతము. పండితుల అభిముఖమునకువచ్చి నాలోపములను సవరించుకొందమన్న ధనములేమిచే సాధ్యముకాదు. అట్టి అసాధ్య మైనలేమిని సాధ్యముచేసి, ప్రపంచకమునకు తమ యుదారసాహ సములను తెలుపుచు, ఆంధ్రభాషామతల్లికి వన్నెదెచ్చు మహా మహులయుండ జేరుటచే నాబోటులకు పండితుల సాన్నిధ్యము సుల భముగా లభించుచున్నది.

ఆధునిక పాఠశాలలందు బాలురును బాలిక లొకచోటనే విద్య గరుపబడుచున్నారు. అందుచేతనే యిట్టువంటి వైపరీత్యము లచ్చటచ్చట సంభవించుచున్నవి. అట్టి వైపరీత్యముల ననుసరించి యీచిన్న పుస్తకమును కల్పించి రచియించడ మైనది. యీపుస్త కముయొక్క సర్వహక్కులు సరస్వతీ బుక్ డిపో ప్రొప్రయిటర్స్ కురుకూరి సుబ్బారావు అండ్ సన్ వారికి యివ్వడమైనది.

ఖాసింకోట
1—11—37

ఇట్లు
సాయం వెంకటరావు

# విషయసూచిక



# వచ్చుబోట్లు

నీలకంఠరావు

విజయరామ మహీపాల పాలితంబైన విజయనగరమే మన కథా ఘట్టమునకు తొలి సోపానము. విజయనగర మిప్పుడు విజయరాముని కాలమున నున్నట్లులేదు. కోటయందుకూడా ననేకమార్పులు కలిగినవి. శత్రువులు ముట్టడించుట కలవి గాకుండునట్లు కోటచుట్టునూ త్రవ్వబడి సర్వకాలములయందునూ జలపూరితమైయుండెడి కందక మిప్పుడు జలశూన్యమై వర్షములకు పడిన స్వల్పజల మా కందకమందుచేరి మురిగి యా మార్గముల సంచరించు వారల నాసికాపుటంబుల బ్రద్దలుచేయునంతటి దుర్వాసన కొట్టుచుండును. దీనికితోడు పురసమీపము నందొకతటాకము కూడకలదు. అందలి నీరు పశువులుకూడ త్రాగవు. ఆ తటాకమంతయూ, తామరలతో నిండి యందలి నాచంతయు మురిగి, యా దుర్వాసన మార్గస్థుల నాటంకపరుచుచుండును. అందుచేతనే కాబోలు నా గ్రామమున దోమలబాధ మిక్కుటము. విజయరాముని కాలమున నెట్లుండెనో కాని. యా కాలమున యీ స్థితిలోనున్నది. పురపాలకసంఘము వారే కారణ

మునసో ప్రజల కనారోగ్యము కలిగించునట్టి దుర్వాసనల తొలగిం చి దోమలబాధ నివారించుటకు పూనుకొనలేను. యీ బాధలభరిం పలేకనే కాబోలు మన నీలకంఠరావుగారి వెలుపల నొక విశాల మైన భవనము నిర్మించుకొని కాపురముండిరి. నీలకంఠరావొక గొప్ప ధనికుడు. మెక్కువ పలుకుబడి గలవాడు. ఆతని గృహముచుట్టునూ పెద్ద ప్రాకార మొకటి గలదు. ఆప్రాకారములో వివిధ ఫలవృక్షము లుండెను. ఒకవైపున నొక పెద్ద యుద్యానవనము గలదు. ఆ యు ద్యానవనమున నొక కాసారముకూడ త్రవ్వబడియుండెను. యీ ఫల పుష్పోద్యానవనముల నడుమ నొక రెండస్థులమేడ యొకటి నిర్మింప బడియుండెను. ఆ గోడలపై చిత్రింపబడిన చిత్రవిచిత్రంబు లప్పటి శిల్పకళానైపుణిని వేనోళ్ళచాటుచుండెను. యీ యుద్యానవనమును కమల విహరించుటకై వేయించి అందు కొన్ని పాలరాతితిన్నెలగూడ యేర్పరచిరి. మున్నుంగా జామాతృ సహితముగ తను ముసలబిడ్డ యందుసంచరించుట గని యానందించవలయునని కాబోలు. వృద్ధుల యోచనలు దురూహ్యములుగదా? కమల పదునారేండ్ల పడుచు. నవలావణ్యవతి. నీలకంఠరావు దుర్గాంబల కొక్కతెయే కుమార్తె యగుటచే అతిగారాబమున పెంచబడినది. నీలకంఠరావు వృద్ధుడైన నూ ఆతని యుద్దేశ్యములన్నియూ ఆధునికములగుటచే యాతడు స్త్రీవిద్యను నిరసింపక తన కుమార్తెకు హైస్కూలునందు స్కూలు ఫైనలువరకూ విద్యనేర్పించి కాలేజిలో ఇంటర్ క్లాసునందు చేర్పించె ను. కమల ప్రతిదినమునూ కాలేజికేగుటకై నీలకంఠరావొక కారు ను కొనియిచ్చెను. ప్రతిదినమునూ కమల యీ కారునందే కాలేజికి పోయి వచ్చుచూ నడుమ నడుమ తనమిత్రుడగు శివరావుగృహమున కేగి యచట కొంతతడవుండి యింటికి వచ్చుచుండును. వొక్కొక నాడు కాలేజినుండి యిర్వురునూ కలిసి యీ కారులోనే యింటి

పోవుచుందురు.

శివరావుకూడా యీ కాలేజియందే బి.ఏ. మొదటి సంవత్సరము చదువుచుండెను. అతని కిరువదిసంవత్సరముల వయసుండును. కమలాశివరావుల కిర్వురకు నానాటికి మైత్రి వృద్ధియగుచుండెను. కమల సాధారణముగా శివరావు గదిచెంతకే యేగి చదువుకొనుచుండెడిది. ఒక్కొక్కనాడచ్చటనే పండుకొనుటకూడా తలపెట్టుచుండెను. శివరావుకూడా వొక్కొకదినమున నర్ధరాత్రిమునకూడ కమల కడకు వచ్చి చూచిపోవు చుండెడివాడు. వీరి మైత్రి యితరులకు వెగటు గలిగించుచుండక పోలేదు. తండ్రియూ కటకట బడుచుండెడివాడు. కాని గారాబుపట్టి యగుటచే యామెను నిర్బంధించుట కాతనికి శక్తిచాలలేదు. శివరావు తండ్రిపేరు భగీరథుడు. యీతడుకూడ విజయనగరమున నొకలక్షాధికారి. విశాలమగు నొకమేడ అశ్వశాలలు అనేక పరిచారికా పరిచారకులుగలరు. శివరావు కమలను ప్రేమించుచున్నసంగతి భగీరథుడెరుంగును. అట్లుప్రేమించుట నీలకంఠున కయిష్టమనికూడ యెరుగును. అనేకపర్యాయములు భగీరథుడు శివరావును మందలించెను కాని ప్రయోజనము లేకపోయెను. అత్యంత ప్రేమానురాగములతో నున్నవారి నాటంకపరుప నెవరికి సాధ్యము? నీలకంఠునకు కమలయన్న ప్రాణమైనను, యితరుని పెండ్లి చేయవలయునని యున్నదికాని యాంతటి కఠినము వహింప జాలడాయెను.

నాడంతవరకింకను కమల యింటికిరాలేదు. నీలకంఠుడెందులకో కమలకొరకతియాతృతతో యెదురు జూచుచుండెను. కమల యెచ్చటనున్నది? నాడు కాలేజిపరీక్షల జయాపజయము లెరింగించు దినమగుటచే శివరావుతోగూడి కాలేజి కేగినది. నాడు కాలేజియంతయు బాలురచే నిండియున్నది. పరీక్షులయందుత్తీర్ణులైన వారందరూ తమజయమునకు సంతోషముల వెలిబుచ్చుచు అపజయము పొందిన

వారినోదార్చుచుండిరి. యిట్టిస్థితిలో మన నాయకీ నాయకులిద్దరు మోటారు నధిష్టించి గృహోన్ముఖులైరి. వారి ముఖములేలకో కళాహీనములై కనపడుచుండెను. తుదకు శివరావు కమలనుచూచి "కమలా! యేమని చెప్పెదవు?"

కమల: పరీక్షపోయినదనియే చెప్పెదను.

శివ: ఇదివరకెన్నడునూ పరీక్ష తప్పక ప్యాసయ్యెడివాన విట్లపజయముపొందుట సందేహము. మన మిద్దరము స్వేచ్ఛగా విహరించుచూ చదువుమానితిమని మనయపజయములే తెల్పుచున్నవి. మనమిద్దర మిట్లు సంచరించుట లోకులకు కంటగింపుగ నున్నమాట యట్లుంచుము. నీ తండ్రి కేమాత్రి మిష్టములేదు. యీ వార్త విన్నచో అంతయూ నాపైనే విరుచుకొనిపడునేమో. నీ తండ్రి నీ విషయమునకూడా కట్టుదిట్టము చేయకమానడు. యిక మున్ముందు మన యిద్దరకూ ముఖావలోకనము కూడా కరవగునేమోయని తోచుచున్నది.

కమ: నాకునూ అదియే భీతికలుగుచున్నది. దీనికేదేని యుపాయము దొరుకకుండునా?

శివ: యేదయినా యోజింపవలయును.

అని యనుచుండ నింతలో శివరావు గృహము సమీపించుటయు, శివరావు కమలయొద్ద సెలవు పుచ్చుకొని కారు దిగుటయు సంభవించినది. కమల యేదియో దుర్భరముగ నాలోచించుచూ కూరుచుండి కారు శరవేగమున పోయి తమ యింటి ముందు నిలిచియున్న సంగతికూడా యెరుగదయ్యె. కొంతవడికి స్మృతి తెచ్చుకొని కారుదిగి లోనికేగినది. కుమార్తె కంటబడినతోడనే కమలా! పరీక్ష యేమయినదని నీలకంఠరావు ప్రశ్నించెను. కమల పరీక్ష తప్పితినని ప్రత్యుత్తర మిచ్చినది. నీలకంఠున కాపాదమస్తకము జాజ్వల్యమాన

ముగా మండిపోయినది. కమలను కోపదృష్టులతో జూచుచూ ఓసీ! అవివేకినీ! శివరావు స్నేహమునకు ఫలితము తెలిసినదా? ఎన్ని పర్యాయములు చెప్పితిని. యెన్నివిధముల బోధించితిని. నా హితవాక్యములన్నియూ ద్రోసిపుచ్చి నే నెరుంగకుండ రహస్యముగ నెప్పటియట్లు శివరావుతో స్నేహము నెరపుచుంటివి గాని మానవైతివి. నీ వాతనితో స్నేహమొనర్చుచుంట తెలిసిన యింకొకడు నిన్ను పెండ్లియాడునా? నిన్ను శివరావు కిచ్చి మాత్రము పెండ్లి సేయనని ఘంటా పథముగ చెప్పలేదా? యేకపుత్రికవను మమకారంబున గట్టిగా నేమియు ననజాలక యుపేక్షించుచున్నందున మితిమీరుచుంటివా? వృద్ధాప్యమున నన్నిట్లు క్షోభ పెట్టుదువా? చాలు! యిక నీ చదువు చాలు. త్వరలోనే సంబంధము కుదిర్చి వివాహము చేసెదను. నేటినుండియు నీ విల్లు కదిలి బయటకేగిన సహింపను. జాగ్రత. అని గద్దించెను. కమల పుట్టినదిమొదలింతవరకు తండ్రిచే నిట్లు గద్దింపబడలేదు. నేటి స్థితిచూచి కారులో శివరావు చెప్పిన మాటయే నిజమగుచున్న దని తలంచినది. తండ్రి మాటలు వినునరికి గుండె వ్రయ్యలైనది. కమల కను లశ్రుపూరితములైనవి. కాని యేమి చేయగలదు?



పలాయనము



రాత్రి పదకొండుగంటలుకా జొచ్చెను. విజయనగర పురవాసులందరూ గుండెలపై చేతులువైచుకొని నిద్రాదేవియొడిలో ఉయ్యాల లూగుచుండిరి. పురమంతయూ నిశ్శబ్దముగనుండెను. శీతాంశుడప్పుడప్పుడే తన శీతలకరముల వెదల్చుచూ లోకమును వెండిపూతపూ

యటనైకై ఉదయాద్రినుండి తొంగి చూచుచుండెను. వెన్నెల వచ్చుచుండుటచే కాబోలు పురపాలక సంఘమువారు విద్యుచ్ఛక్తి దీపములార్పివైచిరి. గడిదొంగల కాలిచప్పుడులు పసిపట్టికాబోలు గ్రామసింహములు గర్జింపదొడగెను. అట్టి నిశాసమయమున విజయనగరమునందు సందుగొందుల తిరుగుచు యెట్టకేలకు రాజవీధింబడి విజయనగరముదాటి శరవేగమున సింహాచలము వైపునకు పోవుచుండెను. ఆ శకటవేగ సంజనిత ధూళి ధూసరితము మహీన కిరణ మరుగుపరుచుండెను. అది యెచటికి పోవునో తెలియదుకాని అందు యిర్వురు పురుషులుండుటమాత్రము కనపడుచున్నది. అందొకడు దీర్ఘకాయుడు. మిగుల బలవంతునివలెనుండెను. వయసుమాత్ర మిరువదియైదు వత్సరముల లోపుండును. రెండవవాడు సామాన్యపొడగరి. నవలావణ్యవిలసితుడు. యింకనూ మీసాలురాలేదు. పదునారువత్సరముల వయసున కెక్కుడుండదని తోచెడిని. యిర్వురునూకూడ నొకరితో నొకరు మాటలాడకుండ నిశ్శబ్దముగ కూర్చొనియుండిరి. దీర్ఘకాయుడగు పురుషుడు కారునడుపుచుండెను. వీరి ముఖవైఖరుల పట్టి చూడ తమ్మెవ్వరో వెన్నాడుచున్నట్లు భీతులై మాటి మాటికిని వెనుదిరిగి చూచుచుండిరి. ఆకారు క్రమక్రమముగ సింహాచలము దాటి సబ్బవరము చేరి యచట రాజబాట వీడి నాటు మార్గమున కొండలు తిప్పలూ దాటిపోయి దొంగలమర్రి యొద్ద నాగెను. ఆమర్రి సామీప్యమున దొంగల ప్రవాసములు గలవనియు ఆ మార్గమున బోవు ప్రయాణీకులను దోచుకొనుచుందురని ప్రతీతి. మన ఆగంతుకులు అచటినుండి యెచటి కేగదలంచిరోకాని కారునుండి క్రిందికిదిగిరి. ప్రతీతి యనుమాట ప్రత్యక్షమైన దన్నటుల కొందరుచోరులకస్మాత్తుగ వచ్చి వీరిపైబడిరి. కాని మనదీర్ఘకాయుడు వారితో పోరాడుటకుద్యమించెనుగాని రెండవ యాతడు పోరాడకుండ నాపి చోరులతో సఖ్య

మొనర్చుకొన ప్రయత్నించెను. దీర్ఘకాయుడు వారికెంత ధనముకావలయునన్న యంతయిచ్చెదనని చెప్పెను. దొంగలందుల కంగీకరించి మనదీర్ఘకాయుని వారలకు నాయకునిగ నుండుమనికోర ఆతడందుల కంగీకరించెను.

అంత నా చోరులును దీర్ఘకాయుడును రెండవవాడును కాలిబాట గుండా అరణ్యములోనికి ప్రయాణము సాగించిరి. గాలికిరాలిన యెండుటాకులు వారి పాదముల క్రిందపడి గలగల చప్పుడగుచుండెను. ఆ శబ్దమును యెవరైన యాలకించి తమ్ము వెన్నాడుదురేమో నను భీతియొదవుచుండెను. కాని దొంగ సాయమున్నదిగదా యని మరల ధైర్యము వహించుచుండిరి. ఆపథికులు క్రమముగా కాలిబాట వీడి జనదుర్భేద్యమగు కాననమందు ప్రవేశించిరి. ఆ రాత్రి సమయమున ఆ అడవినిబడి కష్ట ప్రయాసతో డేగలమెట్టజేరి మెట్టపైకెక్కి నందొక బిలమునందు ప్రవేసించి బిలద్వారమును జాగరూకతతో బంధించి బిలమునందలి సోపానములు దిగి కొంతదూరమేగి యట నొక బయలు ప్రదేశముజేరిరి. అందొక మేడయున్నది. దొంగలా మేడ తలుపులనుదీసి మన నూతనాగంతకులను లోన ప్రవేశపెట్టిరి. లోనికేగిన పిదప వారందరందు సుఖాసీనులై యిట్లు సంభాషింప దొడగిరి.

దొంగ: ప్రభూ; మీదేయూరు.

నూతనుడు: యిప్పుడవి యేమియూ మమ్మడుగ వలదు. మేము సబ్బవరము దగ్గరనుంచి మార్గముతప్పి యా మర్రిచెంతకు వచ్చితిమి. అచటనుండి మాకు సరియైనమార్గము దొరుకలేదు. మార్గాన్వేషణము కొరకై క్రిందకు దిగితిమి. యంతలో మీరువచ్చుటయు మొదలైనవిషయములు జరిగినవి. సరే మీసంఖ్యయే మాత్రమున్నది?

దొంగ: సుమారు రెండువందలమంది యున్నాము.

నూత: అందరకునూ యిదియే యుద్యోగమా.

దొంగ: అవును బాబూ! యీ నడుమ మానాయకుడు చనిపోయి నాడు. అప్పటినుండియు సరియయిన నాయకత్వము లేక కొందరు చెల్లా చెదరైరి. కొందరము మిగిలియున్నాము.

నూత: మంచిది. మీ కోర్కెప్రకారం ఇకనుంచీ మీకు నేను నాయకుడుగా నుండెదను. మన కెట్టి భయమునూ లేదు. మన మొక సంకేతిక మేర్పరచు కొనవలయును. గుర్తు లేకున్నచో కష్టము. అవి యన్ని తెల్లవారినపిదప యోజించుకుందము. అనిచెప్పెను. అంతలకు దొంగలు వల్లెయని నూతనులకు శయనాకదిములజూపి హాయిగా నిద్రించిరి.



## కమల కనపడుటలేదు



సాయంకాలమైనది. దివాకరు డస్తాద్రి గ్రుంకబోవుచుండెను. ఆకసమంతయు కెంజాయావహించి ప్రకృతి కెంతయూ శోభ గూర్చుచుండెను. మేతల్కై యేగినపశువు లంబాయను శబ్దములు మిన్నుముట్ట గృహములకు చేరుచుండెను. వివిధ పక్షిజాలములు కిలకిలా రావములతో తమ గూండ్లకు చేరుచుండెను. యిట్టి సమయములో నీలకంఠరావుగారెచటనుండియో పోలీసుస్టేషన్ వైపున బోవుచుండిరి. వారి ముఖవైఖరిని బట్టిచూడః వారు కడు వేసరినట్లు దోచుచున్నది. తమలో దామేదియో గొణుగుకొను చుండిరి. నడుమ నడుమ వేడి నిట్టూర్పులు బుచ్చుచుండిరి. కొంతవడికి పోలీసుస్టేషనుకు చేరిరి. అప

మయమున సబుయినస్పెక్టరు నాగేశ్వర్రావేదియో కాగితములు చూచుకొను చుండెను. నీలకంఠరావు లోనికేగి సబుయినస్పెక్టరుకు వందనము లర్పించెను. సబినస్పెక్ట రందులకు ప్రతివందన మొనర్చి సగౌరవముగ గూర్చుండుట కొక కుర్చీచూపి యాతడు కూరుచున్న పిదప వారి రాకకు కారణమడిగెను. నీలకంఠుడు విన్నబోయిన మొగముతో యిట్లు చెప్ప దొడంగెను. "అయ్యా సబుయినస్పెక్టరుగారూ నాకుమార్తె కమల యను చిన్నది నిన్నటి రాత్రినుండియూ కనపడుటలేదు. యూరంతయూ వెతకితిని యెచటనూ కనపడలేదు. వొడలిపై రెండువేల రూప్యముల నగకట్టున్నది; యెటుపోయినదీ తెలియదు. యెవరైన చోరులచేత చిక్కినేమోయని భయమగుచున్నది అని చెప్పి కనులనీరు నించెను. సబుయినస్పెక్టరది యంతయూ చాల కించి రిపోర్టు వ్రాయించి తీసుకొని కమలయొక్క ఛాయాచిత్రమేమైన యున్నచో కావలయునని కోరెను. నీలకంఠరావందుల కంగీకరించెను. మరల నేమని తలచెనోగాని సబుయినస్పెక్టరు కమల పడకగది పరిశీలింప వలసియున్నదని నీలకంఠున కడిగెను. నీలకంఠరావు వల్లెయని సబుయినస్పెక్టరును తన యింటికి తీసుకొనిపోయెను. నీలకంఠరావునకు మేడయున్నదనియు చుట్టూ ప్రాకారమునూ ఆప్రాకారమునందు ఫలవృక్షములును యుద్యానవనంబునూ కలవనియూ మా పాఠకులీవరకే యెరుగుదురు. ఆమేడ క్రిందభాగమున నొకపెద్ద హాలు దానిచుట్టునూ ఆరుగదులున్నవి. గోడలభాగమంతయూ చాల రాతిచే కట్టబడియున్నది. సబుయినస్పెక్టరును నీలకంఠరావు మేడ పైకి తీసుకొని పోయెను. మేడ పైభాగమున పెద్ద హాలు నాలుగు విశాలమగు గదులున్నవి. అందొక గదిలోనికిపోయి యదియే కమల పరుండుగదియని నీలకంఠుడు మోహన్ రావుకు చూపెను. ఆగదియందనేక విధములగు పటములు గోడల కమర్చబడియున్నవి. ఒక పెద్ద

పందిరిమంచము దోమతెర సహాయున్నది. ఒకవైపున కమల పుస్తకముల బీరువాయున్నది. మన సబుయినస్పెక్టరు రాగది నంతయూ జాగరూకతతో పరిశీలించెను. అందాతనికి కమల జాడల దెలుపు నాధారమేమియూ కానరాలేను. తుదకా మంచముపైనున్న పరుపును చుట్టిచూచిరి. అచట, "ప్రియమైన కమలకు" అనివ్రాసి యొక యుత్తరమున్నది. సబుయినస్పెక్టరది చదువుకొని నీలకంఠరావు నిట్లు ప్రశ్నించెను

సబు: కమల కెవ్వరైన స్నేహితులుకలరా?

నీల: యెవరునూ ఉన్నట్లుతోచదు.

సబు: యిది! యీ యుత్తరము చూడుము. అని ఆ యుత్తరము నీలకంఠుని చేతికందీయగా నీలకంఠుడు దాని నిట్లుచదివెను.

విజయనగరము,
దీ 25—5—38.

ప్రియతమా.

నీకోర్కెప్రకారము నే నన్నియూ సర్ధముచేసితిని. యీ రాత్రి 11 గంటలకు నేను మీయింటివైపునకు వచ్చెదను. నీవు సిద్ధముగ నుండవలసినది.

ఇట్లు
నీ ప్రియమిత్రుడు.

అనియున్నది. ఆయుత్తరము నీలకంఠున కేమియూ సర్ధముకాలేను. సబుయినస్పెక్టరు నిట్లు ప్రశ్నించెను. దీనినిబట్టి మీ రేమి గ్రహించితిరి?

సబు: మీ కుమార్తెకు యెవరో యొకమిత్రుడు వ్రాసెను. వారిరువ్వరదివరకే యెటకోపోవుటకు నిర్ణయించుకొనిరి అనిచెప్పెను.

కమలకు శివరావుకునూ గల మైత్రిని వెల్లడించినచో యీత

యితరవిధముగ తలంచునని నీలకంఠుడది వెలిబుచ్చలేదు. కానియిప్పుడు చెప్పక తప్పదాయెను. యెట్టకేలకిట్లు చెప్పెను. కమలకును భగీరథుని కొడుకగు శివరావుకును మైత్రికలదు.

సబు: ఆతడూరి యందుండెనా?

నీల: యేమో యెచటనూ కనపడినట్లులేదు.

సబు: సరి నేనువిచారించి తరువాత తెలియజేసెదనులెండు. సాధ్యమైనంత ప్రయత్నించి మీకుమాత్రైను మీ కప్పగించెదనని చెప్పి సబు యినస్పెక్టరు వెడలిపోయెను. "ఓరి! తుచ్ఛుడా! శివరావ్! యెంత పని చేసితివిరా?" యనుచూ నీలకంఠుడు కుర్చీలో చతికిలపడెను.

అంధకారము క్రమముగా షూంత్రికుని యింద్రజాలమురీతిని మాయముకాజొచ్చెను. రేయియంతయు తమ కులాయములందు హాయిగనిద్రించి శకుంతసంతానంబులు కిలకిలారావములు చెలరేగ ఆహారములకై పరుగెత్తుచు నాల్గుదిక్కులను మూలాలు ప్రసవవేదన వేనోళ్ళ చాటుచుండెను. అగ్నికణాబువలె భానుడు ప్రాగ్దిశ నుద్భవించుచుండెను. విజయనగర పురవాసులందరూ కాలకృత్యములు దీర్చుకొనుటకై బయలుప్రదేశముల కేగుచుండిరి. ఆసమయమున విజయనగర స్నాన ప్రాకారమునకు పశ్చిమదిశయందున్న కందకము నందు మురికినీటిలో నొక మొండెము తేలి యాడుచుండెను. జనులందరునూ గుంపులుగూడి యామొండెమును చూచుచుండిరి. అది స్త్రీశవమని కొందరును పురుషశవమని కొందరును వాద ప్రతివాదములు సలుపుచుండిరి. దివాకరుడుంతన ప్రయాణముసాగించి సహస్రకిరణముల వెదజల్లుచుండెను. యెనిమిదిగంట లగునప్పటికి యీశవము సంగతి విజయనగరమునందు దాబాల గోపాలమునకు తెలిసిపోయెను. అట్టిచో రక్షకభటులకుమాత్రమే యెట్లు తెలియకుండును. సబుయినస్పె

క్టరు నాగేశ్వర్రావప్పుడే కొందరు రక్షకభటులతో మృతకళేబరమున్న స్థలమునకరిగి శవమును కందకమునుండి పైకితీయించెను. పరిశీలించి చూడగా నదియొక స్త్రీ శవమని తెలిసినది. దానికి తలయునూ కాలుసేతులునూ లేవు. మొండెముమాత్రమే యున్నది. ఆబిడ యెవరో అట్లు చంపబడుటకు కారణమేమో యెవరికినీ తెలియదు. సబుయినస్పెక్టరాశవమును సుభ్రతగ కడిగించిచూచెను. ఆమె యొడలిపై నున్న వస్త్రము విలువగలది. నాగేశ్వరరావు కేమియోచన తట్టెనోకాని యీ మొండెము నొకబండిపై వేయించి పోలీసు స్టేషనుకు గొనిపోయి నీలకంఠరావునకు వార్త నంపెను. యిద్దరునూ ఒకే పర్యాయము చెరియొక వైపునుండియూ వచ్చిరి. సబుయినస్పెక్టరు యిద్దరినూ కూర్చుండజేసి నీలకంఠరావును చూచి నీలకంఠరావుగారూ యీ శవమెవ్వరిదో గుర్తింపగలరా యని ప్రశ్నించెను. నీలకంఠరావా మొండెము నొక పదినిమిషములట్లు నిదానించి జూచెను. యెందువలననో నీలకంఠుని కనులశ్రుపూరితము లయ్యెను. ఆతడు రెండుచేతులతో ముఖము కప్పుకొనెను.

సబు: అదేమట్లు ముఖము కప్పుకొనెదరు?

నీల: అయ్యా యింకేమున్నది. యీమెయే నా కుమార్తె కమల. యీమెను హత్యగావించి యీమె యాభరణము లన్నియూ దోచుకొన్నారు. యీమె శరీరముపై సుమారు 2000 రూప్యముల విలువగల యాభరణము లున్నవి.

సబు: తలగాని, కాలుచేతులుగాని, లేవుగదా. యీమెయే మీకు కుమార్తె యని యెట్లు చెప్పగలరు.

నీల: అయ్యా కాలుసేతులునూ ముఖమునూ లేనంతమాత్రమున తమబిడ్డల యాకృతులను గుర్తింపజాలని తలిదండ్రులుందురా? అయిననూ యీ శరీరచ్ఛాయనునూ నా కమల శరీరచ్ఛాయ

కునూ తేడా ఏమాత్రమూ లేదు. యీ చీరె నేను మా కమల పుట్టిన దినమున కొని తెచ్చితిని. మొన్నటిసాయంత్ర మామె వ్యాహాళి కేగునపు డీచీరయే ధరించినది.

సబు: సరికాని. నీలకంఠరావుగారూ? శివరావు గుణగతముల గూర్చి మీ కేమైనా తెలియునా?

నీల: శివరావ్, శివరావ్ ఆతడే నాకొంపతీసినాడు. యిది నిజముగా నతడు చేసినపనియే. కపటప్రేమ నభినయించి మోసముచే నామెనుగొనిపోయి వధించి యాభరణములతోటి పరారియైనాడు. ఆతడు కడుదుర్మార్గుడు. రౌడీ, దొంగ, నా యింటనే యాతనితండ్రికి తెలియకుండ కొంతధనము దొంగిలించి రంగూను పారిపోయె ఆ ధనమున్నంతవర కటనుండి అయిపోయిన తరువాత యిలుచేరినాడు. ఆ తండ్రి కొకడే పుత్రుడు కావున గట్టిగా నాతని శిక్షించుటకు భగీరథుడు పూనుకొనలేదు. అనిచెప్పి యినస్పెక్టరుగారూ యెట్లైననూ ఆదుర్మార్గుని శిక్షింపజేసినగాని నా మనస్సంతాపము చల్లారదని పల్కెను. సబ్ యినస్పెక్టరది యంతయూ నాలకించి నీలకంఠరావుగారూ దుఃఖింపకుడు. నిజముగా నీమె మీ కుమార్తెయేయయి యెవరిచే వధింపబడినను పరిశోధించి తప్పక శిక్షింపజేయుదము. యిక మీరు దయచేయుడని చెప్ప నీలకంఠుడు వెడలిపోయెను. తరువాత సబుయినస్పెక్టరు కమలయొక్క ఛాయాపటమును మోహన్‌రావుకు చూపెను. మోహన్‌రావా ఛాయాచిత్రమును దగ్గరనుంచుకొని యీ మొండెమునకును చిత్రమునకునూ పోలికలేమైన కలియునేమోయని చూచెను. కొన్ని పోలికలుమాత్రము కనబడుచున్నవి కాని యీ మొండెము కమలదేనని చెప్పుటకు వీలులేదు. ఆ మొం

డముయొక్క ఛాయాచిత్రముగూడ దీయించి మొండెమును పోష్టుమార్టముకు పంపిరి. సబుయినస్పెక్టర్ నీలకంఠునిగృహము పరిశోధించుట మొదలైన విషయములను మోహన్‌రావుతో చెప్పి కమలపడకక్రింద దొరకిన యుత్తరము నాతని కిచ్చెను. మోహన్‌రావా యుత్తరమును చదివి ఈ దస్తూరి యెవరిదో యేమైన విచారించితిరా యని యినస్పెక్టరుగారి నడిగెను. లేదని యాతడు జవాబు చెప్పెను.

ఇంతలోనె రామరాజగుదెంచెను. సబుయినస్పెక్టరాతనిజూచి కూరుచుంట కాసన మొసంగి "చాలా దూరము వచ్చితిరి. వూరక రారుమహాత్ములు" అని పరిహాసముగా పలికెను. రామరాజామాటలువిని చిరునగవు నగి "మా షెడ్డునందలి 2964 నంబరుగల కారు కనపడుటలేదు. యివ్వాళ యేదో పనియుండి కారుకొరకు షెడ్డు తాళము తీయబోగా తాళము అప్రయత్నముగా వూడివచ్చినది. లోపల కారులే" దని చెప్పెను. "మీ పరిచారకు లెవరైన తీసుకొని పోయిరేమో" నని మోహన్‌రావనెను.

రామరాజు: అందరనూ విచారించితిని. యెవరునూ తీసుకొని పో లేదు అని చెప్పెను.

ఆవార్త విని సబుయినస్పెక్టరు మోహన్‌రావు యిరువురూ కలసి రామరాజు వెంట నాకారుషెడ్డు చూచుటకై పోయిరి.





మోహన్ రావొక సుప్రసిద్ధ పత్తేదారుడు. విజయనగరమునందొక మార్వాడీయింట బందిపోటు జరిగిన సందర్భమున మోహన్ రావును పరిశోధకునిగా నియమించిరి. యీతని కిరువదియైదు వత్సరముల వయసుండును. కోరమీసములు. సుందరమైన పురుషుడు. మిగుల బలిష్ఠుడు. బందిపోటును గూర్చిన పరిశోధన యింకనూ పూర్తి కాలేదు. రేయింబవలు నిద్రాహారములు మాని రహస్యమును భేదింప ప్రయాసపడుచుండెను. చోరుల జాడలు కొంతవరకు తెలియవచ్చినవికాని యింకనూ శోధించుచుండెను. ఈ పరిస్థితులలో మోహనునకివి రెండు క్రొత్త కేసులు. మొండెమెవరిది? చంపినదెవరు? మోటారు నెవరు సంగ్రహించిరి? మోహన్ రావునకు రాత్రియంతయూ నిద్రలేదు. యిదియే ఆలోచన. చనిపోయినది కమలయా? కమల యనుట కాధారమున్నదా? చిత్రపటమునకు ఆ మొండెమునకునూ సామ్యమంతగా కనపడుటలేదు. కమల మొండెమే యనుటకు యీ యుత్తరమేమి చేయవలయును? దీనినిబట్టిచూడ కమలయే స్వయముగా తనను తీసుకొనిపొమ్మని తనమిత్రునకు తెలిపినట్లును ఆతడారాత్రి యామెను తీసుకొనిపోయినట్లునూ తేలుచున్నది. యీ మొండెము కమలదేనని నీలకంఠుడు చెప్పుచున్నాడు. యేమో శరీరమునుపట్టి గుర్తించుటకష్టము. చీరెమాత్ర మట్టిదింకొక యువతికట్టుకొని యుండగూడదా? లేక కమల బ్రతికియేయున్నది. మిత్రునితోకూడి **2964 A** కారుమీదనే పలాయనమై పోయిరి. కాదు నాతడే దొంగిలించెననుట నిర్వివాదాంశము. ఆతడే శవదాతయైయుండును. కారు పెద్దుచెంత నిర్వ్యారి పదచిహ్నములు కనబడు చున్నవి. ఆ పదచిహ్నములు వీరివేనని చెప్పుట యెట్లు? నమ్మని యూహానిట్లుచేసి యీ కారుమీద పారిపోయెనే

మీ యేదినిర్ధరించుటకునూ వీలులేదు: అని యిట్లు వితర్కించుకొనుచుండ పోష్టుజవానదు దెంచి ఉత్తరముల నిచ్చి వెడలిపోయెను. మన పత్తేదారుడా యుత్తరముల నొకటొకటిగా చదువుకొనుచుండెను. అందొక యుత్తరము కలెక్టరు దొరవారిదగ్గరనుంచి. కమల హత్య విషయమునుగూడా అపరాధిని పరిశోధించ వలసినదని మోహన్ రావుకే వుత్తర్వొసంగబడినది. కలెక్టరుదొరవారి యుత్తర్వు లేకున్ననూ మోహన్‌రావు తనంతటతానే ఆ యుద్యమమందు దిగెను. మరియొక కవరు విప్పిచూచెను. అందిట్లున్నది.

పత్తేదారు మోహన్ రావుగారికి—

అయ్యా!

మీరనవసరముగా చేనిపోని జోక్యము కలిగించుకొని యీ హత్యానేరమును పరిశోధింప సమకట్టుచుంటిరి. మీరు మమ్ము పట్టుకొనగలరను వెఱ్ఱియాశ వదలివేయుడు. అట్లు ప్రయత్నించుట వలన మీకుగూడ ముప్పుకలుగగలదు. మాతో వైరముబూనుట కాలాహితో చెలగాటమువంటిది. గాని యీ యుత్తరము చూచినతదుపరి యైన మీ ప్రయత్నములు మానవలెను. లేనిచో ప్రమాదము తప్పదు.

ఇట్లు
మీ శ్రేయఃముగోరు
పచ్చబొట్టు

యింతలో నెచటనుండియో గోపాలరా వరుదెంచెను. గోపాలరావున కిరువది యేండ్లుండును. రూపసి, బలశాలి. మోహన్ రావుగారి చెంత పరిశోధనా విధానము లభ్యసించుచుండెను. ఆతడు రాగానే మోహన్ రావా యుత్తరమును గోపాలరావున కిచ్చెను. గోపాలరావది చదివి హంతకుడు బహుచతురునివలె నున్నాడు. వ్రాతకూడ పోల్చుటకు

పీలులేకుండ నలుగు రైదుగురు వ్రాసినట్లు వ్రాసినాడు.

మోహ: అవును. నీవిచారణ యేమైనది?

గో: కాలేజివిద్యార్థుల నందరినీ యడిగితిని. గ్రామములోకూడ చాల దూరము విచారించితిని. యెవరి నడిగిననూ అతనివిషయమై దుర్మార్గుడని చెప్పువారేగాని నొకరును మంచివాడని చెప్పలేదు. యిదుగో అతని ఫోటో నొకదానిని సంపాదించితి నని యిచ్చెను.

మోహ: యిది యెచట సంపాదించితివి?

గో: భగీరథుని చెంత.

మోహ: అతడిచ్చెనా?

గో: అతడిచ్చునా? పరదేశీయునివలె పోయి మంచితీర్థము త్రాగి గోడకుతగిల్చిన యీ ఫోటోనుచూచి యాశ్చర్యపడినట్లు నటించి "అరరే యీ ఫోటో నా మిత్రుడగు శివరావువలె నున్నదే? యిచట కెట్లువచ్చినదని దానినితీసి చేతపట్టుకొని భగీరథు నడిగితిని. అతడు తనపుత్రునిదని బదులుచెప్పెను. అతని జూచి చాలదినములైనది. యిపు డెచటనుండెనని యడిగితిని. యెచటికో గ్రామాంతరమున కేగెనని చెప్పెను. నేను కాసేపు విచారించిన వానివలె నటించి ఆ మాటయు నీ మాటయూ చెప్పుచూ పటము చేతబట్టుకొనియే లేచివచ్చితిని.

యీ మాటలు విని మోహనుడు సంతసించి యిద్దరునూ కలసి యెచటికో పోయిరి.



చో రీ



రాత్రి పన్నెండుగంటలు. ప్రకృతికాంత నల్లచీరె ధరించినది. పురవాసులందరూ గాఢనిద్రా పరవశులైయుండిరి. ఆయర్ధరాత్రమున విజయనగర సామీప్యమున కొన్ని గుర్రములు కట్టివేయబడి యుండె ను. అచటనొక మోటారుకారు కూడకలదు. గస్తీతిరుగు రక్షకభటు డు పన్నెండున్నర కొట్టుసరికి ఆవీధిచివరవరకునూ పోయి గుర్రముల సకిలింపులతో సందడిగనుంటచే ఆవైపునకేగి అదియేమో చూచి రావలయునను తలంపుతో పోయిచూచెను. మంచి బలిష్టములగు గుర్రములున్న అచట మనుష్యులెవరును వున్నట్లు కనబడలేదు. అంత మోటారుచెంతకేగి చూచెను. అందునూ యెవరునూలేరు. తన చే లాంతరుతో కారునంబరు చూడ 2964 A అనియున్నది. అది దివాణ ములో దొంగిలింపబడిన కారు. ఆసంగతి జ్ఞప్తికి వచ్చి యా పోలీసు భటుడు పరుగుపరుగున పోలీసుస్టేషనుకు పరుగెత్తెను. అచటనిదురించు చున్న కొందరు పోలీసుభటుల సాయముగైకొని శీఘ్రమే మాగముస నచ టికి చేరునప్పటికి ఆ రక్షకభటుడింతకు జూచిన గుర్రములుకాని మో కారుగాని కనబడలేదు.

పాపమాతడు కారు దొరికినయెడల దొంగతనము తాను పట్టు కొనినందులకు దివాణములో గొప్పబహుమానము లభించుననియు గవర్నమెంటువారు తన చాకచక్యమునకు మెచ్చి యుద్యోగము హెచ్చించెదరనియు సబ్ యిన్స్పెక్టరు నాగేశ్వర్రావు పత్తేదారు మోహన్‌రావునకన్న తానే గొప్ప తెలివిగలవాడని ప్రజానుగ్రహింప బడయవచ్చుననియు యువ్విళులూరుచూ ప్రయాసపడి పరువెత్తి సహాయము గొని వచ్చినందులకు ఆ కారున్నూ గుర్రములు అదృ శ్యములగుటచే ఆతని యాశలన్నియు నిరాశలైపోయినవి. మిన్ను

విరిగినట్లైనది. రక్షకభటులందరూ తెల్లబోయి చూచిరి. మిగిలిన వారందరతని నధిక్షేపించిరి. నిదుర లేపికొని వచ్చినందులకు కొందరు దూషించిరి. యాతడది సహించలేక కసకసలాడుచు "మిమ్ముల నేననవసరముగా గొనివచ్చియుండలేదు. యిదిగో కారువచ్చిన జాడ. యివిగో గుర్రపుటడుగులు చూడుడు. అని టార్చిలైటు వేసి చూపెను. యిదిగో యీ మార్గమున పోయినట్లున్నది అని చెప్పి అందరునూ వెనుదిరిగి పోయిరి. గస్తీ దిరిగిన యాతడు మాత్రము యింటికిపోక యీ వార్త సబుయినస్పెక్టరుగారి కెరిగించుటకై పోయెను. అతడేగు సరికి యినస్పెక్టరుగారు నిద్రాపరవశులై యుండిరి. రాత్రి చాలా ప్రొద్దుపోవువరకు మోహనరావుగారితో మాటలాడుచుండి నిద్రించు నప్పటికి పన్నెండుగంటలగుటచే యెన్ని పిలచినను యినస్పెక్టరు పలుకుటలేదు. యెట్టకేలకు ఆతడు మేల్కొనెను. రక్షకభటుడాతనికి నమస్కరించి జరిగిన వృత్తాంతమంతయూ చెప్పెను. సబుయినస్పెక్టరది యంతయూ నాలకించి సరే యిపుడు చేయదగినదేమున్నది? తెల్లవారినతరువాత చూచుకొందము. యీ వార్త మోహన్‌రావు గారికిగూడా యెరిగింపుము అని చెప్పి పరుండెను. ఆ రక్షకభటు డప్పుడేపోయి మోహన్‌రావుని లేపెను. ఆతడొక పిలుపునకే పలికెను. నాగేశ్వరరావు వలె మొద్దునిదుర పోయినచో మోహన్‌రావు పత్తేదారుపని కెట్లు దెట్లినను? అపరాధపరిశోధకులు కనులనిండా నిదురపోవుదురా? మోహనరావు తలుపు తెరచుకొని బయటికి వచ్చి యా పోలీసుభటునీక్షించి యేమిపనిమీద వచ్చితివని యడుగగా, నా కాన్‌స్టేబుల్ తాను జూచినదంతయూ చెప్పెను. మోహన్‌రావా స్థలమెచటనని ప్రశ్నింపగా దక్షిణముగా నూరికొక ఫర్లాంగుదూరమున వటవృక్షము చెంత బయలుస్థలమున జూచితినని చెప్పెను. మోహనుడతని పంపివైచి వెంటనే దుస్తులుధరించి యింటికి తాళ

ము వేసి టార్చిలైటు చేతపట్టుకొని బయలుదేరి వెడలిపోయెను. క్రమక్రమముగా తెలతెల వారజొచ్చెను. రాజమార్గముల జనసంచారము సాగెను.

ఆరాజమార్గమున నొక యింటినుండి ఐదారుగురు మూలుగుచున్నధ్వని వినవచ్చుచుండెను. మార్గికులు ఆ యింటిముందాగి ఆ మూల్గు విని యెవరో జబ్బుగా నుండి మూల్గుచుండిరని తలచి పోవుచుండిరి. క్రమక్రమముగ యెనిమిదిగంటలు కాజొచ్చెను. ఆయింటి తలుపులింతవరకునూ తెరవబడలేదు. మూల్గులుగూడ ఆగలేదు. యీవార్త క్రమ క్రమముగ నూరంతయూ నల్లుకొనెను. సబుయినస్పెక్టరు పోలీసు స్టేషనుకు వచ్చుచుండగా మార్గములో వారికిగూడ తెలియ వచ్చెను. స్టేషనుకు బోయి రక్షకభటుల సాయముగొని పోవుదమని పోలీసుస్టేషన్ కేగగా నచట గోపాలరావు కూర్చొని యుండెను. గోపాలరావుని చూచినతోడనే మోహన్‌రావుగా రెచ్చటనని యినస్పెక్టరుగారు గోపాలరావుని ప్రశ్నించెను. వారి యింటికేగితిని. యిల్లు తాళమువైచియున్నది. మీకేమైన వారిజాడ తెలియునేమో కనుగొందమని యిటువచ్చితినని గోపాలరావనెను. అంత రాత్రిసంగతి చెప్ప యెట్లైన పోయెనేమో నని చెప్పి సబుయినస్పెక్టర్ నలుగురు రక్షకభటులను తీసుకొని గోపాలరావుతో సహా ఊరులోనికేగెను. విచారణమీద నా మూల్గుడు వినవచ్చుచున్న సౌధముదరి కరిగి తలుపులు తట్టి పిలిచిరి. జవాబు మూల్గుడే. యిక పిలచిన ప్రయోజనము లేదని తలచిరి. తలుపులు పుతక లెత్తుటకు వీలులేదు. మిగిలిన మూడువైపులా యింటికి ప్రాకారపు గోడ యున్నది. అందరునూ దొడ్డిగోడ వైపునకేగి ఒక భటుని లోనికిదింపి దొడ్డితలుపు తీయించి అందరునూ లోనికేగిరి. యింటి దొడ్డి తలుపు రెక్కలతలుపగుటచే మీటలెత్తి తీసి గృహము లోనికేగిరి. అది వంటయిల్లు. ఆ యింటి

తలుపుగూడా యెత్తితీసివైచి లోనికేగి వీధితలుపు తెరచిరి. లోపల నలుగురు వ్యక్తులు. కాలుచేతులు బంధింపబడి నోటికి గుడ్డలు కట్టబడి మూల్గుచుండిరి. పోలీసువారు వారల కట్లన్నియూ నూడదీసిరి. వెంటనే యా గృహయజమాని సబుయినస్పెక్టరుకు నమస్కరించి "అయ్యా! మాకొంప పోయినది. తస్కరులు మాయింటబడి మమ్మెల్లరబంధించి మా ధనమంతయూ కొల్లగొట్టిరి." అని రోదనమొనర్ప సాగెను. దొంగలాయింట నెట్లుప్రవేశించి నదియు వీరి కర్థమగుట లేదు. యెచటనూ కన్నములేదు. తలుపులన్నియు బంధింపబడి యున్నవి. యిల్లంతయూ కలయ వెదకిరి. యెచటనూ మార్గము కనపడలేదు. గోపాలరావు తలపై కత్తి యింటికప్పు పరీక్షింప దొడంగెను.

కొంతసేపటికి గోపాలరావు సబ్ యినస్పెక్టరును పిలిచి యింటికప్పుచూపి చూచితిరా? మార్గముకనిపెట్టితిని హంతకులు కప్పుపెంకులుతీసి వెదురుబద్దలు తెగగొట్టి లోననొకడు ప్రవేసించి మిగిలిన వారికొరకు తలుపుంటతీసెను. తిరిగిపోవునపుడుగూడ దొంగలనందరనూ బైటికిపంపి తలుపులన్నియు లోనబంధించి మరల నాతడొక్కడును కప్పుపైకెక్కి బద్దలను యథాప్రకారమమర్చి పెంకులుకప్పెను. అనిచెప్పి యదార్థము తెలిసికొనుటకొకరక్షకభటునిపై కెక్కించి తీయించిచూచిరి. బాగుగా మనిషిదూరుటకు సరిపడురంధ్రమేర్పడినది. తరువాత యింటిలో పోయిన ఆస్తి యెంతయుండునని గృహయజమానిని ప్రశ్నించిరి. ఆతడిల్లంతయూ వెతకిచూచుకొని గదియందలి పెట్టెలు తెరచిచూచి అయ్యా ముప్పదివేల రూప్యములు నోట్లు రెండురోజులక్రితము ధనాగారమునుండి తెచ్చియుంచితిని. ఆ ధనము మాత్రమే దొంగిలింపబడినదని చెప్పెను. ఆ గృహమును పరిశోధించుటలో గోపాలరావునకొక చేతిరుమాలు దొరకెను. అది గృహయజమానునికిచూపి యిది మీదేనా యనియడిగెను. తనదికాదని యజ

మానిచెప్పెను. హంతకుని యాకృతియెట్లుండెనో చెప్పగలవా? యని యడిగెను. అందులకు గృహయజమాని "అతనిరూపు మిట్లుండునని మొగము గుర్తుపట్టకుండునట్లు నల్లని ముసుగు వైచుకొనియుండెను. ఆతని మొలనున్న పట్కాకు "పచ్చబొట్టు" అను అక్షరములు చిన్న చిన్న విద్యుచ్ఛక్తిదీపములతో నమర్చబడియుండెను. ఆతనిమిత్రునకు గూడ ముసుకేయుండెను. మిగిలినవారివి నల్లని యాకృతులు అని చెప్పెను. సబ్ఇనస్పెక్టరు వారిచేత స్టేటుమెంటులు తీసుకొని వారినూరార్చి వెడలిపోయెను. పోలీసుస్టేషనుకు పోవుమార్గము పోవుచుండగనూ గోపాలరావునకు వారియింటవద్ద దొరికిన చేరుమాలు పరీక్షించుటతోడనే సరిపోయినది. ఆ రుమాలుపై చాకలిగుర్తుమాత్రమున్నది. పోలీసు స్టేషనుకు వచ్చినపిదప నొక పోలీసును పిలచి యీమార్కుగల వస్త్రము లెవరియింటియందైన నున్నవేమో తెలుసుకొని రమ్మని పంపెను కొంతసేపటికా కానిస్టేబులు తిరిగివచ్చి చాకలియిళ్ళన్నియూ తిరిగితిననియూ యెచటనూ లేవనియు నొకచాకలి పరిసేపట్నమునందు తమబంధువులయింట యీ మార్కుగల వస్త్రములు చూచినట్లు గుర్తున్నదని చెప్పెనని గోపాలరావుకు చెప్పెను. గోపాలరావేదియో యోజించుకొని యిన్స్పెక్టరునొద్ద శలవుతీసుకొని వెడలిపోయెను.



# అన్వేషణ



కలకత్తా మెయిల్ నర్శిపట్నము స్టేషనులో నాగినది. ప్రయాణీకులు కొందరు రైలుదిగి టిక్కెట్లునిచ్చి యిండ్లకు పోవుచుండిరి. కర్షకుడొకడు ప్రయాణీకుల నందరినీ జాగరూకతగ చూచుచు క్రమక్రమముగా గేటుదాటి రాజమార్గమునబడి పోవుచుండెను. అతని దృష్టి యంతయూ రాజమార్గమున నడచు జనులవస్త్రములపై పర్వులెత్తుచుండెను. క్రమక్రమముగా నాతడా రాజమార్గముదాటి చాకలవీధిని జేరెను. అంచనా వస్త్రములయందు గుప్తపరచిన చేరుమాలును పైకితీసి ప్రతిచాకగృహములోనికిపోయి ఆ చేరుమాలుపై గుర్తును బోలుగుర్తుగల వస్త్రము లెవరియింటనైన గలవాయని విచారించుచుండెను. అట్లా గ్రామమునగల రజకగృహములన్నియూ వెతకి తుదకొక చాకలియింట నా రుమాలు జూచి యిది నీ కెచట దొరకినదని ప్రశ్నించెను. ఆంతనా కర్షకుడొక వస్త్రములమూట తెనపాలమున దొరకినదనియు అది యెవరిదో కనుగొని వారికంద జేయవలయునని కోరుచుంటినియు తెలిపెను.

చాకలి: అట్లాయిన నామూటు నాకిచ్చినచో వారికంద జేసెదను.

కర్ష: అట్లుకాదు. ఆ వస్త్రముల నేనే స్వయముగా వారికొసగి యేదేని బహుమానము పొందవలయునని నాయాస. వారి గృహమెచ్చటనో నా కెరుకపరచినచో వారు నాకొసగిన బహుమానమునందు కొంత నీకుకూడ యిచ్చెదను.

చాక: చూపినపిదప మరల నీవెప్పుడు కెందులకు వచ్చెదవు. అయిననూ వారెప్పుడునూ ఈ యూరనుండరు. అప్పుడప్పుడు వచ్చుచుందురు.

కర్ణ: అట్లయిన యీ రూపాయిముందుగనే తీసుకొనుము. (అని యొక రూపాయినిచ్చి) యిప్పటికి తీసుకొనుము. వారిచ్చు బహుమతినిబట్టి తరువాత యింకకొంత యిచ్చెదను. అయితే వారెపుడెపుడీ గ్రామమునకు వచ్చుచుందురు.

చాక: అయిదారు దినములకొకసారి వచ్చుచుందురు. వొక్కొక్కపరి రెండు రోజులకొకపరియే వచ్చుచుందురు.

కర్ణ: యెచటికి పోవుచుందురో.

చాక: సింహాచలదేవళమునకు నని చెప్పుదురు.

కర్ణ: వారి రూపము లెట్లుండును.

చాక: యొకడు దీర్ఘకాయుడు, బలిష్ఠుడు, సుమారు యిరువది వత్సరములుండును. రెండవవాడు పేడివలెనున్నాడు. మీసములుగాని, గడ్డముగాని కానరాదు. అందమయిన ముఖము. ఆకారముజూడ స్త్రీవలెనుండును. కాని యాతడెప్పుడును పురుషదుస్తులే ధరించియుండును. చాలా లేప్రాయము. పదునారు వత్సరములకన్న నెక్కుడుండదు.

కర్ణ: యిపుడు వారిచటనేయుండిరా?

చాక: నాల్గుదినములైనది. పోయి మరలనేడో రేపో రాగలరు.

కర్ణ: వారిగృహమెచ్చట.

చాక: యీరోడ్డున సూటిగాబోయి కుడిచేతివైపు తిరిగినచో యెడమవైపున ఆరవయిల్లు.

కర్ణ: సరే అట్లయినమంచిది. వారియూరునకువచ్చినపిదప వారివస్త్రముల నాకిచ్చి బహుమతిగైకొని మరలనేలుసుకొనియెదను.

అని చెప్పి బయలుదేరి రాజమార్గమున సూటిగాబోవుచుండెను. మార్గమధ్యమున నొకభిక్షుకుడు యెదురువచ్చెను. ఆభిక్షుకుని గాంచిన వారలాతని కిరువది వత్సరములుండునని చెప్పకనమ్ముదురు. ఆతడు

ధరించిన వస్త్రములన్నియూ జీర్ణములై యుండెను. క్షురకర్మకు డబ్బు లేకుంటచే కాబోలు గడ్డము మీసములు బాగుగా పెరిగి చూచు వారల కసహ్యము కలిగించుచుండెను. ఆస్థితిలోకూడ నాతని ముఖమతిగాంభీర్యమై యుండెను. అతని గాంచిన తోడనే మన కర్షకుడొక క్షణ మటనిలిచెను. అతని కాభిక్షుకుడు చిరపరిచితుడు కాబోలు.

కర్ష: యేం తాతా యిప్పుడుయేవూళ్ళో వుంటుండుపు.

భిక్షు: మాదో కూరేంటి? అడుక్కుతినేవాళ్ళ కన్నీ వూళ్ళే. మొన్న యిజయనగరంలో అడుక్కున్నా నిన్న సిమ్హాచలం గుడికాడడుక్కున్నా. యియ్యాళీవూరొచ్చా.

కర్ష: బిచ్చం యాడన్నా దొరికినదా?

బిచ్చు: యాడా దొరకలా. యీవూళ్ళో దొరుకుద్దనే ఆశవుంది.

కర్ష: తాతా మొన్న యిజయనగరంలో వుండానన్నావుగిందా మొన్న రేత్రి ఆవూళ్ళో పెద్ద దొంగతనంజరిగిం దిన్నావా?

బిచ్చు: యేందది.

కర్ష: నీకు తెలీదన్నమాట. దొంగలు గుఱ్ఱాలమీద మోటార్లమీద వొచ్చి ఆటన్నిటినీ వూరిబేట దింపిర్రట. వూళ్ళొకొచ్చి పెద్ద బజారులో వో యింటికప్పుకు కొక్కెట్టి లోనదూరి ఆ యింట్లోనందర్ని కట్టిపడేసి ఆళ్ళ పెట్టెల్లో ముప్పదివేల రూపాయలు పోనాయుంట. పోలీసోళ్లు చూత్తావుంటే నానుకూడా పోయి చూశాను. దొంగపేరు పచ్చబొట్టంట.

బిచ్చు: అలాగా అయితే నువ్వీడకొచ్చావెందుకు.

కర్ష: నాకేదో చేతిగుడ్డోటి దొరికింది. అది యీ వూరిదంట యిచ్చి పోదామని వచ్చా తాతా.

బిచ్చు: నేని వూరొరినందర్నీ యెరుగుదు. ఆ గుడ్డ నేనిత్తా గానీ సబ్బారంకాడ పెద్ద తిరణాలంట. నే పోదామంటే ఆడ బువ్వ

దొరకదేమోనని పోనేను. నువ్వు పోయి ఆ తిరణాల చూసి రేపు యిజయనగరంకాడ నన్ను కలుసుకో. ఆసంగతు లన్నీ సెపుతే యినన్నా సంతోసిత్తాను. ఆ రుమా లిటుతే. ఆళ్ళ యిల్లేడంట.

కర్ష: (ఆ రుమా లాతనికిచ్చి) యిదిగో యీసందులో యెడమవైపు ఆరవయిల్లట. ఆరెప్పుడూ యీడుండరంట. నాలుగు రోజులకో పాలి వొత్తారంట.

భిక్షు: చరెలే? నూ పో.

అని చెప్పగా కర్షకుడు వెడలిపోయెను. భిక్షుకుడంత నా సందున బడి యిండ్లు లెక్కపెట్టుకొనుచు ఆరవ గృహము యెదుటికి పోయి నిలచెను. ఆ గృహము మిక్కిలి పురాతనమైనది. ఆ సౌధమున మానవసంచార మేమియు కనపడుటలేదు. ఆయిల్లుమిగుల శిధిలావస్థయందుండుటచే ప్రాకారపుగోడ లచ్చటచ్చట భూమియందు లీనమైపోయెను. ఆగృహము వెనుక పార్శ్వమందొక చిన్నమామిడితోట కలదు. ఆతోటయందితరులు ప్రవేశించకుండునటుల చిళ్ళకంప బ్రహ్మజెముడు మొదలగు ముండ్ల పొదలచే దట్టముగ నలముకొనబడి చీమదూరుటకుగూడ వీలుగానుండెను. మన భిక్షుకు డాగృహము చెంతజేరి గృహబహిర్ద్వారమున నిలిచి "ధర్మాత్ములు తలిదండ్రులును మహనీయులారా! నాకడు పాకలిచే మలమలమాడుచున్నది. కొంచెము భోజనము పెట్టింపుడు" అని యరచుచుండెను. ఆసౌధము నుండి యెవరును బయటకురారైరి. జబాబే లేకుండెను. అంత మన భిక్షుకుడు ఆ ద్వారము సమీపించి తట్టుచూ "ధర్మం బాబూ" అని కేకలిడుచుండెను. అంత నాగృహమునుండి యొక బాలు డరుదెంచి తలుపులను తెరచి యొక పావలా ఆ భిక్షుకుని చేతి యందిడెను భిక్షుకు డాబాలుని యుదారస్వభావమునకు సంతసించి యాతని సత

కూర్చుండుమని కోరెను. బాలుడచట నించుకకూర్చొనెను. ఆతనికి పదునాలుగు వత్సరముల వయసుకు మించియుండదు. రూపసి వారి ద్దరకీ క్రిందవిధమున సంభాషణ జరిగెను.

భిక్షు: నాయనా! నీదేయూరు?

కుర్ర: మాది విశాఖపట్టణము.

భిక్షు: యీ యిల్లెవరిది.

కుర్ర: యీ యిల్లెవరిదో నేనెరగను. ఆయన దీయూరు గాదు. మా సముద్రోకహరి వచ్చి యుద్యోగముకై గొనిపోవుచుండును.

రక్షు: నాయనా! నీవు చాలాయుదారస్వరూపుడవు. చాలా అదృష్ట వంతుడవుగూడాను. నీవు గొప్ప ధనవంతుడ వయ్యెదవు. నీ కొక గొప్పయింటి సుందరి భార్య కాగలదు.

అని చెప్పదొడగెను. ఆ బాలు డీత డొక జ్యోతిష్కుడని తలచెను. మరల వారల వారికిట్లు సంభాషణ సాగెను.

భిక్షు: నాయనా! నీపేరు?

బాలు: నాపేరు రాములు.

భిక్షు: మంచిపేరు. రాములూ యీ యింటిలో అద్దెకున్న దెవరు?

రాము: మా యజమాని.

భిక్షు: ఆయనపేరు?

రాము: ఆయన పేరు నాకు తెలియదు.

భిక్షు: నీ వాతనికడ నుద్యోగమున కుంటివా?

రాము: ఆఁ

భిక్షు: జీతమెంత?

రాము: జీతమింతయని లేదు. అన్నవస్త్రములిచ్చి నాయావజ్జీవనము పోషింతుననియు తానే వివాహము చేయుదుననియూ చెప్పి యుంచుకొనెను. నా కర్చునకు యెంత కావలయునన్న అంత

యూ నాతడే యిచ్చుచుండును.

బిక్షు: ఆత డిపు డీయూర నుండెనా?

రాము: లేరు.

బిక్షు: యెచటికి వెళ్ళిరో?

రాము: యేమో తెలియదు.

బిక్షు: యెపుడు వచ్చెదరో?

రాము: వొక మాసమువరకూ రానని చెప్పినారు.

బిక్షు: అయ్యో. యెంత నిరాశ యైనది.

రాము: యేమైనది?

బిక్షు: నాకొక్క చేరుమాలు దొరకినది. అది ఆయన కిచ్చినచో యేదేని బహుమానమిచ్చునని యాసపడితిని.

రాము: యేదీ ఆ రుమాలు.

బిక్షు: యిదిగో

అని చేతికందించి యాతని ముఖమువంక నే జూచుచుండెను.

రాము: (ఆరుమాలు చూచి) మా యజమానులదే. మీకెట్లు లభించినది?

బిక్షు: మీ యజమానులదేయైన మీరే గైకొనుడు. మీ యజమానులు పొరపాటున పారవైచుకొనిరి కాబోలు. నాకు దొరకినది.

రాము: మా యజమానులు స్వప్నమునగూడా పొరబడువారు కారే?

బిక్షు: యేమో పొరపాటెంతటివారికైన నచ్చును.

అనుచూ లేచి నాయనా! ఆకలి యగుచున్నది. అని లేచి బయలుదేరెను. రాములు యేదియో యోజించుచూ లోనికి పోయి తలుపు వైచుకొనెను. మన భిక్షకుడట్లు రాజమార్గమునబడి పోలీసు స్టేషను వెపునకు బోవుచుండెను. చదువరులారా యీ భిక్షకు

డెవరో గ్రహించితిరా? యితడే పత్తేదారు మోహన్‌రావు. యిందా కటి కర్షకుడు, గోపాలరావు. మోహన్‌రావు గోపాలుని సబ్బారం వరకూ పోయి ఆజాకు తీసుకొనిరమ్మని పంపెను. అదియే తిరణాల. తానా రుమాలతో విజయనగమున దొంగతనముచేసినవాడా జీర్ణ గృహమునసే యుండునని నిశ్చయమగుట నొకటి. ఆతడే పచ్చబొట్టు యనియూ తాముతొలుత విజయనగరములో చూచిన మొండెమును వధించిన దీతడేయనియూ దివాణములో కారునుకూడ యీతడే అపహరించెననియు మొన్నటిరాత్రి యూకారే విజయనగరము ప్రారిబయట కానిస్టేబులు చూచెనని చెప్పెననియు గ్రహించెను. కాని యిపుడా పచ్చబొట్టు గ్రామమున లేనిమాటనిజము. యిట్లాలోచించుకొనుచు మోహన్‌రావు పోలీసుస్టేషనుకుచేరి సబుయినస్పెక్టరుకు తన్నెరిగించుకొని ఆ జీర్ణగృహమునుగూర్చి చెప్పి యాయింటిని రహాశ్యముగ యెల్లప్పుడునూ కనిపెట్టియుండి యేసమయమున యెవరెవరాయింటికి వత్తురో విజయనగరమునకు తెలియపర్చుచు ఆయింటినుండి యేసామానునూ పరారిగాకుండ చూచుచుండ వలసినదని చెప్పి వెడలిపోయెను.

మోహన్‌రావు నరిశిపట్నమునుండి మెయిలులో విజయనగరము చేరెను. తోడనే సబుయినస్పెక్టరును కలుసుకొని ఆయింట జరిగిన చోరీవిషయమంతయూ విపులముగ తెలుసుకొని అవియన్నియూ నరిసీపట్నమునందు కర్షకరూపమున నున్న గోపాలరావువలన వినిన సంగతులేయగుటచే వాటినంత లక్ష్యించక గృహమునకేగి స్నానమొనర్చి భుజించి పడక కుర్చీయందు కూరుచుండి యోజించుచుండెను. అపరాధ పరిశోధకులకు నిద్రాహారములుండవు. వారేపని చేయుచున్ననూ వారి యోచనలు మానరు. మానజాలరు. యీ పచ్చబొట్టు యెవరు? యెట్లుండును? యెచటనుండును? కమల జీవించియున్నదా? ఏన నాడు దొరకిన మొండెమెవరిది. ఈ ప్రశ్నలకు సమాధానము వచ్చుటలేదు. యింతలో మొన్నటిచోరీ అంతకుపూర్వమే తాను పరిశోధించుచున్న దొంగతనమొకటి యిన్నికార్యములు మోహన్రావు నెత్తిన పడియుండెను. యీ దొంగతనములన్నియూ యెప్పటికి బయల్పడునో. మోహన్‌రావున కెప్పటికి శాంతికలుగునో. అతని కెప్పుడునూ యీ యోచనయేతప్ప యితరము లేమియు నాతని మనసున జొరనిచ్చుటలేదు. యీ యోచనలతో సాయంత్రము నాలుగుగంటలైనది. మోహనునకు విశ్రాంతి లేదు. యిట్టి స్థితిలో గోపాలరావరుదెంచి యాతని కట్టెదుట నిలచెను. మోహనుడాతనిజూచి గోపాలరావ్ విశేషములేమని ప్రశ్నించెను.

గోపా: మీ పనియేమైనది

మోహనరావు నరిసీపట్నములో ఆ రుమాలు రాములు అను కుర్రవానికిచ్చుట మొదలయిన విషయములు చెప్పెను. అంత

గోపాలరావిట్లు చెప్పదొడంగెను.

గో: మీ చెంతనుండి ముందు సూటిగా సింహాచలం చేరితిని. అచట కొంతతడవుండి యెట్టి యాజ్ఞాకును దొరకమిచే మీ యాజ్ఞ ప్రకారము సబ్బారము జేరితిని. అచటనొక ఘోరము జరిగినది. జమీందారు గారొకడు సింహాచల యాత్రకై బయలుదేరి వచ్చుచుండ సబ్బారమున కనతిదూరమున నొక దొంగల మర్రికలను. ఆ ప్రాంతములకు వచ్చుసరికి బంది పోటు దొంగలరుదెంచి వారిచెంతనున్న ధనము స్త్రీలచెంత నున్న ఆభరణములు దోచిపైచిరట. వారి సేవకులు కొం దరు దొంగలతుపాకుల కెరయైరట. వారటనుండి యెటు బోయిరని ప్రశ్నించితిని. అదియంతయూ మహారణ్యమట. ఆ యరణ్యమునం దదృశ్యులయిరట. నే నావార్త విని చీకటి పడునప్పటి కామర్రిచెంత జేరితిని. నేనచటి కేగునప్పటికి నారూపము మార్చి యొకదొంగవలె తయారయితిని. మార్గ మున యెవ్వరైన పోవుచున్నయెడల వారి నాయకునకెరుక పరచుటకు కాబోలు నిర్వురు దొంగలామర్రికి సామీప్య మున కూరుచుండియుండిరి. కొంతసేపటికొకడు వారిర్వురకు అన్నము గొనివచ్చి యిచ్చి వెడలిపోవుచుండెను. నేనది గాంచి వారికెరుక లేకుండా రహశ్యముగా వానివెంట బడి తిని. అతడా యరణ్యమధ్యమునబడి యొక మెట్టచెంతకు జేరి యందొక బిలమార్గముగుండా లోనికేగెను. నేనా మెట్ట నాల్గువైపుల జూచితిని. యావల నొక గూడెమున్నది. సుమారైదువందల చోరులుందురు. ఆ బిలమునందొక సౌధ మున్నది. అది నాయకుని గృహము కాబోలు. నేనింతవర కును చూచి యొంటరిగ బోయినచో యీ వార్త మీకు

తెలియజాలదనియు అపాయకరమనియూ, కార్యభంగమని యూ తలచి మెల్లమెల్లగా యటనుండి తప్పించుకొని యీవల బడి యిటచేరితిని.

అని చెప్పి మిన్నకుండెను. మోహన్‌రావాతని యన్వేషణమును కొనియాడి సూపర్నెంటుదొరవారికొక రిపోర్టు వ్రాసెను.



## ముట్టడి



ఆ మరునాడు పోలీస్ సూపరింటెండెంటు ఫ్రాన్సిసుదొర వారా రిపోర్టునిట్లు చదువుకొనెను. హంతకులసంఖ్య రమారమి అయి దువందలకు మించియుండును. అందు నానాజాతులవారునూ కలసి యూ దివారాత్రముల వివక్షత లేక గ్రామములపైబడి దోచుకొను చుండిరనియు యిపుడుతనపై నన్వేషణోద్యోగము మోపబడియున్న కేసులన్నియూ సాధ్యమైనంతవరకా డేగలమిట్టయందలి చోరులొన ర్చినవై యుండుననియు నేడేముట్టడించి వారిని పట్టుకొనవలయువ నియు మోహన్‌రావుచెంతనుండి రిపోర్టువచ్చెను. ఆ రిపోర్టుచూచు కొని సూపర్నెంటుదొరవారు 300 మంది రిజర్వు పోలీసులను సాయు ధులుగా తీసుకొని తానుస్వయముగా మోహన్‌రావును వెంటగొని పోయి చోరులబంధింపవలయునని తలంచి మోహన్‌రావునకు కబు రంపి ప్రయాణము సాగించెను. గోపాలరావుకూడ మోహన్‌రావు ననుసరించకపోలేదు. మోహన గోపాలరావులిద్దరూ దారిపొడుగు ననూ యేదియో యోజించుచునేయుండిరి. ఫ్రాంసిసుదొరగారు సబ యినస్పెక్టరు వచ్చుటలేదని పిలువనంపనెంచెను కాని మోహన్‌రావు

వలదనిచెప్పెను. వారంద రుత్సాహముతో పయనము సాగించిరి. క్రమక్రమముగా మెట్టలను గుట్టలనతిక్రమించుచూ వారలొక జన మర్భేద్యమగు కానవమును చేరిరి. అచ్చట రక్షకభటులు వారి యజ మానుని అనుమతి ప్రకారము చోరులున్న మెట్టను పరివేష్టించిరి.

సూపరింటెండెంటుగారును మోహన రావుగారును రిజర్వుపోలీసువారి సహాయమున మెట్టపై కెక్కి మెట్టంతయు గలయనెదకిరి. ప్రథమమున వారికేమార్గమును గనిపించలేదుగాని తుదకొక బిలమును గాంచిరి. ఆ బిలాంతర్భాగమంతయు మిగుల నంధకారమయమై యుండెను. అందులోనికి పోవుటకనువగునటుల సోపానములుండెను. రక్షకశాఖ వారంద రందలి సోపానములగుండా క్రమముగా నా బిలములోని కేగదొడంగిరి. రక్షక భటవర్గమటు కొంత దోవేగుసరికి వారికి మార్గ మధ్యమునందొక యినుప ద్వారము గానవచ్చెను. వారాద్వార మును భేదించి ముందునకు నడువసాగిరి. యిటుల వారైదారు ద్వా రముల నతిక్రమించి తుదకొక చతరశ్రమగు ప్రదేశమును జేరిరి. ఆ ప్రదేశమంతయూ మిగుల నంధకారముగా నుండుటచే వారు మాటి మాటికి వారిహస్తములందలి విద్యుచ్ఛక్తి దీపముల వెలిగించుచుండిరి. మోహన్‌రావు రక్షకభటులనందర నచ్చటచ్చట కాపుంచి కొలది భటులతో ఆబయలు ప్రదేశమునుదాటి యొకసౌధమును ప్రవేశించి తలుపులను తెరచుకొని యొక హాలులోనికేగిరి. అంతలో వారికచ్చ టనుండియో ఘాంమను శబ్దము వినవచ్చెను. రక్షకభటులు సహిత ము గస్మిత్తు దొరగారునూ మోహన్‌రావునూ వున్న ప్రదేశమున బల్లచెక్కలు రెండుభాగములుగా చీలబడి వారందరూ రమారమి పదునైదడుగుల లోతుగల చీకటిగదియందు పడిరి. గోపాలరావు మాత్రము మిగిలిన రక్షకభటులతో బైటదాగియుండెను. ఆ గదియం దుపడిన వారిలో కొందరికి బలమగు గాయములు తగిలెను. ఆ గది

కైవైపునను కిటికీలు లేవుగాని యొక ద్వారము మాత్రముండెను. ఆ ద్వారమున కావల వైపున బలమగు తాళ మొకటి వేయబడి యుండెను.

ఆ బిలమునందు పడినవారలు విముక్తికై మార్గముల నరయు చుండిరి. యిటులొక అరఘంటకాలము గడచెను. అప్పుడొక యువకుడు తెరచియున్న బల్లలకడ నాడి శిరోపరిభాగమునందు నిలవబడి యుండుట వారుగుర్తింపగలిగిరి. ఆ నూతనాగంతుకుడు దీర్ఘకాయుడు మిగుల బలిష్ఠుడునైయుండెను. అతని ముఖమండల మంతయు నల్లనివస్త్రముచే గట్టబడియుండుటచే నతడెవరో గుర్తించుటకు నసాధ్యముగానుండెను. ఆ యువకుని హస్తమునందు కాచుశీసా లుండెను. ఆకాచపాత్రమునందు (నైట్రిక్ ఏసిడ్) Nitric acid అను ద్రావకముండెను. చూచుచుండగనే నాయువకుడా సీసాలు మూతలిప్పి డాల నీవలికిలాగెను. వెంటనే అందుండిపొగలెగయజొచ్చెను. ఆ మాంత్రికుడా బిలమునందా ద్రావకము క్రిందనున్న పక్షికభటులపై బడునటుల పోసెను. ఆ ద్రావకముచేద వారిసుశాఖోద్యోగుల శరీరములు కాలెను, పక్షికభటుల మెడలపైనను బడెను. ద్రావకము మండ జొచ్చెను. వారలా బాధను సహింపజాలక వారియందాఱుగురు మృత్యుముఖమున పతితులైరి. తక్కినవారలకు శరీరముల దచ్చటచ్చట చిన్న చిన్న గాయము లేర్పడెను.

వారా యంధకారబంధురమగు నాగబిలమునందు పడియుండి దారి కానక సీకులాడజొచ్చిరి. యీరీతి నొకటిరెండు ఘంటలకాలము గడచెను. కొంతసేపటికా నగబిలమునందు దాగియున్న పక్షికభటులా దరూ మోహనాము లెంతకునూ రాకుండుటచే నొకచోజేరి బిల ద్వారముగుండా గూడెములోనికేగిరి. అంతట చోరు లప్రమత్తులై మెలగుచుండుటచే నిరుపక్షములవారికిని చిమారమీరా రెండుఘంటల

కాలము సంకులసమరము జరిగెను. రెండువందలమంది రక్షకభటులు తమప్రాణములను గోల్పోయిరి. నూటయేబదిమంది చోరులు పోలీసువారికి వశులైరి. అంత నాభటవర్గము మోహనాదిగాగల రక్షకాధికారులు పడియున్న గదినిచేరిరి. ఆగదికొక్క ద్వారముదక్క నితరమార్గము లేవియు లేకుండుటచే గదిద్వారమును పగులగొట్టి లోనికేగిరి. ఆగదియందు ప్రాణములతో నున్న మోహనాదుల సహాయమువలన ఆ బిలమునందలి గదులనన్నింటి శోధించదొడంగిరి.

వారందరొక గదినిచేరిరి. కాని ఆగదికొక బీగము వేయబడియుండుటచే రక్షకభటవర్గమా ద్వారమును పగులగొట్టి గదిలోని కేగిరి. ఆ గదియందు దుర్గంధ మపరిమితముగా నుండెను. దానిని బాగుగా పరిశీలించగా నట వారికొక స్త్రీ కాలుచేతులు గానవచ్చెను. ఆశకలము అనేకదినములనుండి యుండుటచే నవికుళ్లి మిగులదుర్గంధము గొట్టుచుండెను. రక్షకభటులా శవఖండములను గైకొని రెండవగదిని చేరిరి. ఆగదిద్వారము తెరువబడియుండెను. కాని వారికాగదియందేమియు లభించలేదు. రక్షకభటులటుల రెండుమూడుగదులను వెదకిరి గాని అందు వారికేమియు లభించలేదు. క్రమముగా వారొక పెద్ద గదిని చేరిరి. ఆగదిద్వారము బంధింపబడియుండుటచే వారాద్వారమును పగులగొట్టి గదిలోనికి ప్రవేశించిరి.

గదినుండి భరింపరాని దుర్గంధము వెడలుచుండెను. అందు రమారమీ నలువదిపురుష మృతకళేబరము లుండెను. ఆకళేబరము లనేకదినములనుండి పడియుండుటచే నవికుళ్లి దుర్గంధమును నల్దెసల వెదజల్లుచుండెను. యీ దుర్గంధమును భరింపజాలక రక్షకభటోద్యోగులు తమ నాశికలకడ చేరుమాళ్ళనుంచి ఆగదినివీడి వేరొకగదిని శోధించుటకేగిరి. అందరు నొకపెద్ద హాలునందు చేరిరి.

ఆ గదియంతయు ధూమమయముగా యుండుటచే నొకరిమొగ

మొకరు గాంచజాలకుండిరి. వారలా గిడయందు కొంతతడవుండు సరికి క్లోరీను వాయువా రక్షకభటుల నాశికారంధ్రముల దాకెను. యీ విషయుక్తమగు వాయువును పీల్చుటచే వారిలో కొందరు హతులైరి. మిగిలినవారా గదినివీడి జీవనములతో నీవలికి వచ్చిరి.

రక్షకభటు లీవలికి వచ్చుసరికి ఆచోరశిఖామణి తక్కిన తనయను చరులతో రక్షకభటుల నొక్కిపెట్టున దాకెను. చోరనాయకునకు శరీరమందు రెండుమూడు రివాల్వరు దెబ్బలు తగిలెనుగాని వాటికాతడిసుమంతయు సరకుచేయక పోలీసువారిని హతమార్చుచుండెను. అంతకంతకు పోలీసువారి సంఖ్య అధికమగుచుండెను. అప్పుడచ్చటమాత్రము రెండువందలమంది చోరులుండిరి. యిరుపక్షములవారు చాలావరకు మడసిరి.

రక్షకభటులు చోరనాయకుని కొందరుచోరులను బంధించి వారి హస్తముల కినుపశృంఖలములను దగిల్చిరి. మరియొకసారి రక్షభటులా బిలమును పరిశోధించి వారికందు గానవచ్చిన మృతకళేబరముల నొక శకటముపై వైచుకొని రెండువందలమంది బంధితులగు చోరులతోడను హతశేషమగు సైనికులతోడను సూపరింటెండెంటు మోహన్ రా వుగారలు విశాఖపట్నము సబ్జైలునుచేరి అందు వారినందరిని బంధించిరి.

చోరులు పట్టుబడిరనువార్త పట్టణమందంతయు మారుమ్రోగెను.
పౌరులు గుంపులుగుంపులుగా నా నరాంతకులను గాంచుటకై పోలీస్
స్టేషనున కేగ నారంభించిరి. విశాఖపట్నం సబ్ జైలంతయు హాతా
హాత జనసందోహమయమై యుండెను. చోరులెప్పుడీవలికి గొనిరా
బడుదురా, యెప్పుడు వారిని గాంచుదుమాయని ప్రజలు తహతహ
లాడదొడంగిరి.

పగలు సరిగా పదిఘంటలవేళ అయియుండెను. భానుడు తన
కిరణజాలముల నవనిపై నతితీక్ష్ణముగా ప్రసరింపుచుండెను. అత్తరి
చలనహేతు శకటంబొండు మెజస్ట్రేటుకోర్టువైపు శరవేగముతో నేగు
చుండెను. రక్షకభటులు గుమిగాకూడియున్న జనసమూహమునందు
మార్గమేర్పరచుచుండిరి. క్రమముగా నీ చలనహేతుశకటము కచేరి
ముందర నాగెను. అందునుండి మెజస్ట్రేటుగా రవరోహించి కోర్టులోని
కేగి తన ఆసనమునందు సుఖాశీనులైరి. అచ్చటనున్న జనులందరు
నిశ్శబ్దముగానుండి జరుగబోవు దృశ్యమును గాంచుటకై మిగుల ఆతృ
తతో నెదురుచూచుచుండిరి.

మోహనరావు, సూపరింటెండెంటుగారును తదితర రక్షకభటులును
తాము చోరులగూడెమునందు గాంచిన విషయములెల్లను మెజిస్ట్రే
టుగారికి వ్రాతపత్రముల మూలముగా నెరింగించిరి. అంత నా రక్షక
భటులు వారిఅధికారుల అనుమతి ననుసరించి హంతకనాయకుని
గొనివచ్చి బోనెక్కించిరి. మెజిస్ట్రేటుగారు హంతకుని ప్రశ్నింపదొడం
గిరి.

మెజి: నీపేరేమి.

హంత: పచ్చబొట్టు.

మెజి: అసలు ప్రథమము నీ తలిదండ్రులుంచిన పేరేమి?

హంత: నాకు తెలియదు.

**మెజి:** సరే దానికేమిగాని నీ యొద్దనున్న చోరులెందరు?

**హంత:** అది నేచెప్పను.

మెజిస్ట్రేటుగా రనేక ప్రశ్నల నడిగెనుగాని హంతకుడు వాటి కుత్తరవులొసంగక మూగవానివలె నూరకుండెను. హంతకునకు ఆజన్మద్వీపాంతరవాస శిక్షవిధించబడెను. తక్కిన ఖైదీలను రక్షకభటులు లొకరొకరినిగా గొనివచ్చి మెజిస్ట్రేటుగారి ముందర నిల్పిరి. మెజిస్ట్రేటు హంతకుల ననేకరీతుల ప్రశ్నించుచుండెను. అంతలో ఒక మొండె టనుండియో రుయి రుయి, మను ధ్వనియొనర్చుచూ వచ్చి మెజిస్ట్రేటుగారి వామహస్తమునకు దగిలెను. అందుచే నచ్చటిజనసమూహమునందు కలవరము జనించెను. భటులా జనసందోహమునందు వెదకనారంభించిరి. వారికనుమానాస్పదులగు నలుగురిని బంధించిరి. జనరల్ డాక్టరుగారు చలనహేతుశకటమునపై నట కరుదెంచి గాయమునకు కట్టుగట్టిరి. కట్టుకట్టినదనుక నా డాక్టరుగారచ్చోటువాసి ఆసుపత్రికేగిరి. మరలకేసు విచారణ ప్రారంభింపబడెను. మెజిస్ట్రేటుగారొసంగిన ప్రశ్నలకు చోరులు తగుసమాధానము లొసంగక పోవుటచే రక్షకభటులు వారిని లాటీలచే మోదనారంభించిరి. చోరులా భయంకరములగు లాటీప్రహారములు తాళజాలక సత్యమునే వచియింప సాగిరి.

**చోరులు:** మాలో యెరుకలవారు, కోయవారు, యేనాదివారు, మహమ్మదీయులు, బ్రాహ్మణులు, లంబాడీవారు, మొదలుగా గల అనేకజాతులవారుండిరి. వారిలో కొందరు బియ్యే ప్యాసైన వారుగూడా కలరు. నాది మొదట దక్షిణహిందూస్థానము నివాసమైయుండెను. నా భూములన్నియును పంటలు లేక వాసయుపోవుచుండుటచే నాహారము లభించుట సహితము మిగుల కష్టముగా నుండెను. అనేక దేశము లుద్యోగకాంక్ష

తో దిరిగితిమిగాని మాకు కనీసము కూలిపనిగూడా దొర
కుట కష్టముగా నుండెను. అందుచే దక్షిణ హిందూస్థాన
మును వీడి ఉత్తర హిందూస్థానాభిముఖముగా బిచ్చమెత్తి
కొనుచు మేమందర మొకేసారి బయలుదేరితిమి. యిటుల
కొంతకాలము ప్రయాణ మొనర్చుచు నరశీపట్నం మీదుగా
నేగుచుంటిమి. అప్పుడు మాకిప్పుడు నాయకుడుగానున్న
యువకు డగుపడెను. అతడు మాకు కొంత ఆహారమును
ద్రవ్యమునొసంగి తనయొద్ద భృత్యులుగా నుంచుకొనెను.
మాలో నొక్కొక్కనికి ఒక్కొక్క అశ్వము, కత్తి, రివాల్వ
రు నొసంగి మాకందరికి పాశ్చాత్యపద్ధతి ననుసరించి యుద్ధ
విద్య నేర్పెను. యిదిగాక మాలో కొందరు కోయవారుగ
లరు, వారు విలువిద్యయందు మిగుల నిపుణులు. మాచే మా
నాయకుడు దోపిడులను దొంగతనములను చేయుచుండెను.
కొంతకాలమునకు నాయకుడు మరణించెను. మాలో కొందరు
పరారైరి. తరువాత కొంతకాలమునకు మాకితడు నాయకు
డాయెను. యీతని మిత్రుడును యితడును నల్లని వస్త్రము
లచే వారు తమతమ ముఖములను ముసుగువేసుకొని నేర
ములను చేయుటకేగుచుండిరి. మా నాయకునకుగాని అతని
మిత్రునకుగాని గుండుదెబ్బ కత్తి నరుకు వారినేరియు చేయ
జాలకుండెను.

మెజి: మీకింతకన్న మరేమైన మీ నాయకునిగూర్చి తెలిసియున్న
యెడల మాకు తెలియజేయుడు. మీరటులొనర్చినచో
మీకగు శిక్షయందు కొంతకాలము తగ్గించెదను.

చోరు: మాకింతకన్న మానాయకునిగూర్చి యేమియు తెలియదు.

మెజిస్ట్రేటుగారా చోరులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క సంవత్స

రము కఠినశిక్ష విధించిరి. వీరి నాయకునకు జన్మాంతర ద్వీపాంతర వాసశిక్ష విధింపబడెను. మరునాటి ఉదయము వరకు చోరనాయకుని విశాఖపట్నము జైలునందుంచి మరునాడు అండమానుదీవులకు పంపదలంచి రక్షకభటులా రాత్రియంతయు రెప్పవాల్పక మిగుల జాగరూకతతో కావలికాయుచుండిరి. మోహనునకింకనూ విశ్రాంతి కలుగలేదు. పచ్చబొట్టునకు మిత్రుడొకడున్నట్లు విచారణయందు తేలినది.. యాతని సేవకుడగు రాములు నర్శిపట్నమునందుండెను. ఆ యింట వీరు దొంగిలించిన బాపతు ధనముండవచ్చునని యాతని యూహ. ఆతడు గోపాలరావునిగూడి నాడే నర్శిపట్నమునకు పైనమయ్యెను.



బందీ విముదల



గగనమంతయు కారుమేఘావృతమైయుండెను. సమీరము సాగోరుమని వీచుచుండెను. వర్ష మెడతెగక కురియుచుండెను. ఉరుముల ధ్వనులు మిన్నుముట్టుచుండెను. మధ్య మధ్య విద్యుల్లత లంధకారమును పారద్రోలుచుండెను. ఆకసమంతయు మేఘములుగప్పి పై వర్షపుచినుకులుబడి టపటప ధ్వనిని గల్గించుచుండెను. రక్షకభటులు జాగరూకతతో కావలి గాయుచుండిరి. క్రమముగా రాత్రి సంద్రెండుగంటలు కావచ్చెను. యువకుడొకడు నల్లని యుడుపులను ధరించి విశాఖపట్నం జైలులోనికి చరచర నడచి పోవుచుండెను. ఆ పాంథుడట కావలిగాయుచున్న రక్షకభటులను చేరి వారితో సం

షణ మొనర్చిన అనంతరము వారందరు బీరుపానమొనర్చిరి. బీరు సేవించినకొంతసేపటికి రక్షకభటులు నిర్జీవ ప్రతిమలవలె నట కదలక పడియుండిరి. నూతనాగంతుకుడా పడియున్న రక్షకభటులకడ నున్న తాళముచేతులను వైకొని జైలుద్వారములను తెరచెను. అందున్న హంతకునితో నానూతనాగంతుకుడు కొంతవడి సంభాషించి సంభాషణానంతరము కారాగారము వీడి వారిరువురు పలాయనసూత్రము నవలంబించిరి. రాత్రి ఒంటిగంట కాజొచ్చెను. పారా జవానులు మారుటకై వచ్చిరి. నూతనాగత రక్షకభటులువచ్చి గాంచుతరి కారాగృహపు ద్వారములు తెరువబడి యుండెను. కారాగారమునందు హంతకుడు లేకుండెను. అదియునుగాక కావలిగాయుచున్న రక్షకభటులు గానరాకుండిరి. యీ దుర్వార్త సబుయిన్‌స్పెక్టరుగారికి రక్షకభటులెరింగించిరి. సబుయిన్‌స్పెక్టరుగారీదుర్వార్త నెరింగి కారాగార పరిశోధనకు గడంగిరి. తొలుత కావలిగాయుచున్న రక్షకభటులను గూర్చి యోజించిరి. 129, 467, 376, 293, నంబరులుగల నలువురు రక్షకభటులు చోరులచే బంధితులైరని స్థిరపరచెను.

హంతకుడు తన యనుచరులచే విడిపింపబడియుండి యుండును. వారు కావలిగాయుచున్న రక్షకభటులకు ద్రవ్యమొసంగియో లేక వారిని మోసగించియో వారియొద్దనున్న తాళముచెవులను గ్రహించి చోరనాయకుని విముక్తిగావించి యుండవచ్చునని స్థిరపరచి కారాగారమంతయూ వెదక నారంభించెను. అందు వానికొక లేఖ గన్పట్టెను. అది క్రిందిరీతిగా లిఖింపబడియుండెను.

రక్షకభట శాఖాధికారులగు ఫ్రాంసిసు దొరగారి
దివ్యసముఖమునకు.

అయ్యా!

మీరును మోహనరావుగారును మిగుల ప్రయాసపడి నన్నును నా యనుచరులను పట్టుకొనిరి. పాపము మరుచటి దినమున

నన్ను అండమానుదీవుల కంపదలంచిరి. కాని మీ యూహలన్నియు నిష్ఫలములైనందులకు మిగుల విచారించుచున్నాను. నేనెటుల కారాగారమునుండి విడువ బడితినో మీరెరుంగుటకై మిగుల ప్రయాస పడుచున్నట్లగుపడుచున్నది. ఆ విషయమై మీకు తరువాత చెప్పెదను. రేపటిరాత్రి ఒంటిగంటకు సూపర్నెంటుగారగు మీ యింట బడి మీ కున్న సర్వస్వము నపహరింప దలచితిని. మీకు చేతనైన చో నన్ను పట్టుకొనవచ్చును. లేదా స్త్రీలవలే చేతులకు గాజులు తొడుగుకొని యింటనుండెదరని నా యూహ. తప్పక చోరీజరుగు నని ఘంటాపథముగా బల్కుచున్నాను.

చిత్తగించవలెను.

ఇట్లు

పచ్చబొట్టు

రక్షకభటోద్యోగులా పత్రమును చదివి ఆగ్రహము పట్టజాలక పండ్లు పటపట గొరకుచు నాంతకుని బట్టుకొనుటకై బహుకంకణులై తగుయత్నములు చేయసాగిరి. దేశీక్కర చోరులను కత్తులతో పొడచిగాని తుపాకులతో గాల్చిగాని చంపునటుల కఠినముగా శాసించిరి. మోహన్ రావుగారి కొరకై చర్చిపట్నమునకు వెంటనే కారునంపిరి.



చోరీ



మోహన్ రావు నర్సీపట్నము జేరి తోడనే పోలీసుస్టేషనుకడ కరిగి యింటిసంగతి విచారించెను. ఆరాత్రి యొక కారుపై నొక యాగంతకు డరుదెంచి కావలియున్న రక్షకభటుని జంపి ఆ యింటగల సామానుతో ఆకుర్రవాని తీసుకొని వెడలిపోయెనని చెప్పెను. ఆ వార్త వినుసరికి మోహన్ రావునకా సబుయినస్పెక్టరుపై నెక్కుడులేని కోపమునూ వచ్చెను. అనుకొనిన పనియంతయూ ధ్వంసమైనది. యీ చోరుని కొరకింక కొన్నిదినములు శ్రమపడవలయును. అని యనుకొనుచు ఆయింటికేగి చూచునప్పటికి బయటగొళ్ళెము పెట్టబడియుండెను. ఆ యింటిగొలుసులుతీసి యిల్లంతయూ పరీక్షించెను. యేమున్నది జీర్ణగృహమునకంతోము శూన్యగృహమైనది. మోహనుతిరిగి మరల పోలీసుస్టేషను చేరునప్పటికి విశాఖపట్నమునుండి యొక కారువచ్చినది. అందునుండి యొక రక్షకభటుడు దిగి మోహన్ రావును గాంచి పచ్చబొట్టు పలాయనమును గూర్చియు సూర్యకాంతగారి యింటి యారాత్రి పచ్చబొట్టు దొంగతనము చేయునాడని చెప్పినయుత్తరమును గూర్చియు చెప్పి మోహన్ గోపాలరావుల నాకారు నెక్కించుకొని వెడలిపోయెను. మోహన్ రావు ప్రయత్నమంతయూ వృథాయైనది. మోహన్ రావు విజయనగరము చేరి సూర్యకాంతగారికి ధైర్యము చెప్పి తన ప్రయత్నమునందుండెను. క్రమ క్రమముగ చీకటిపడెను.

విజయనగరము పూర్తిగా నల్లని వస్త్రము ధరించెనో యను నటులొప్పుచుండెను. గగనమంతయు మేఘాదృశ్యమై యుండెను. నక్షత్రము లారిపోవుచున్న జ్యోతులవలె మిణుకుమిణుకు మను సన్నని కాంతుల ప్రసరించుచుండె. మధ్యమధ్య తారకావళులు మేఘముచే

మరుగుపడుచు మరల స్పష్టముగా గానవచ్చుచుండెను. సమీరము హోహోయని వీచుచుండెను. రమారమి అప్పుడు రాత్రి పండ్రెండు గంటలైయుండును. అందుచే పురపాలకసంఘమువారి దీపములారి పోవ సిద్ధముగా నుండెను. జంబుకములు, శునకములు మాత్ర మప్పు డప్పుడు కూయుచుండెను. మధ్యమధ్య రక్షకభటుల యీలలు మాత్ర మస్పష్టముగా వినవచ్చుచుండెను. ప్రకృతియంతయు నిశ్శబ్ద ముగానుండెను. అట్టివిశాసమయమునందు కంటోన్ మెంటుకు సమీ పమునందున్న ఫ్రాంసిస్‌గారి బంగాళాకన్ని వైపులందును రక్షకభటులు జాగరూకతతో గావలికాయుచుండిరి. మధ్యమధ్య వారి అధికారులు హెచ్చరించుటచే నా రక్షకభటులు మిగుల జాగరూకతతో గావలి యుండిరి. కునుకిపాట్లు పడుచున్న రక్షకభటులు తమ అధికారు లకు వెరచి జాగరూకులై యుండిరి..

వారిలో కొందరు దొరగారి పూలతోటయందును మిగిలినవారు దొరగారి బంగాళాయందును చోరులకు గానరాకుండా జాగ్రతగా దాగి కావలిగాయుచుండిరి. అర్ధరాత్రివరకు దొరగారు మేల్కాంచి యుండిరి. కాని నిద్ర హెచ్చుగావచ్చుటచే అతనియింటిలో నున్న సోఫాపై మేనువాల్చిరి. అతని అర్ధాంగిమాత్రము నిద్ర రాకపోవు టచే తన పడకకుర్చీపై కూర్చొనియుండి షేక్స్పియర్ నాటకమును చదువుచుండిరి.

అంతలో దొరగారి యింటి కినువది గజముల దూరమందు ఢాం మనుశబ్దము వినవచ్చెను. ఆ ధ్వని వినబడిన వైపందరును రెప్ప వేయక చూడసాగిరి. వారికచ్చటి చెట్లనడుమనుండి పచ్చబొట్టు అను అక్ష రములు స్పష్టముగా గానవచ్చెను. రక్షకభటులందరా వైపే తుపా కులను ప్రేల్చుచు పరుగెత్త నారంభించిరి. రక్షకభటుల కోలాహలము మిన్ను ముట్టుచుండెను. వారు తమచేతియందలి లాంతరులకాంతులు

నలు వైపుల ప్రసరించి వెదక సాగిరిగాని వారి కచ్చట యేమి యుగాన రాలేదు. అచ్చటి భూభాగము నందు మాత్రము రెండు పాదరక్షకుల గుర్తులు గానవచ్చెను. ఇంతలో సూపర్నెంటుగారి గృహమున కోలాహలము జనించెను. రక్షక భటులందరటకు పరుగు పరుగున నేగిరి.

వారు అచ్చటి దృశ్యమును గాంచు సరికి కొయ్య బొమ్మలవలే చేష్టలుడిగి ఒక నిముషమటుల గడపిరి. యిక చెప్పవలసిన దేమున్నది. సర్వనాశన మైనది, సూపర్నెంటుగారి అర్ధాంగి సోఫాపై మరణించి రక్తపు మడుగునందు పడియుండెను. సూపర్నెంటుగారు కాలు చేతులను బంధింపబడి నోట గుడ్డలు క్రుక్కబడి యుండెను. తక్షణమే రక్షక భటులాతని కట్లను విప్పివైచి ఆ మృతకళేబరము నొక చలనహేతు శకటముపై వైచుకొని సివిల్ ఆసుపత్రి కేగిరి.

మిగిలినవారు పరిశోధనకై గడంగిరి. వారికంతయు నగమ్యగోచరముగానుండెను. హంతకుడెట్లు గృహములోనికి చొరబడినదియు నెరుంగజాలక మోహనాదిగా గల రక్షకోద్యోగులందరు విస్మయమొందసాగిరి. గృహాంతర్ భాగమునందంతయు గలయ వెదకిరిగాని వారికేమియు లభించలేదు. ద్వారములన్నియు సరిగా మూయబడియుండెను. యింటికప్పును కూడా జూచిరిగాని వారికి చోరులా భాగమునుండి వచ్చిన జాడలేమియు గానరాలేదు. పోనీ గోడకెచ్చటనైనా కన్నముత్రవ్వి అందుండి లోనికి ప్రవేశించెనని అట్టి చిహ్నములేవియు గానరాకుండెను. ఆ బంగాళాయందలి దిగువభాగమంతయు చలువరాతి పలకలచే నిర్మింపబడియుండెను. వారా పలకలనన్నింటి నొకదాని వెనుక నొకటిగా పరీక్షింపసాగిరి. ఆ రాతిపలకలయందొక రాతిపలకమాత్రము కదుపబడినటుల వారి కగుపడెను [illegible] కొందరు రక్షకభటుల సహాయమువలన నా

లక నీవలికి నూడలాగిరి. అందిక చెప్పవలసినదేమున్నది. వారిద్ద క్పథములందొక అంధకారమగు బిలముకనుపడెను. హంతకుడీ బిలము గుండా ప్రవేశమొనర్చినటుల స్థిరపరచిరి.

పోలీసువారందరా బిలమునందలి చిత్రమును గాంచుటకై నా బిలముగుండా పయనము సాగించిరి. ఆ సొరంగము మిగుల సన్న ముగానుండెను. అందిరువురు మనుజులొకతూరి వెళ్లుట కనుగు ణ్యముగా నుండెను. అందుచే వారొకరి వెనుక నొకరు వారి చే లాంతరుల సహాయమున ముందరి మార్గమును వెదకుచు ముందుకు నడువ నారంభించిరి. వా రాబిలమునందు నమారమి రెండుఫర్లాం గుల దూరము ప్రయాణము సాగించిరి. తుదకు వారికి మార్గము గానరాకుండెను. అందుచే వారు ముందుకు సాగుట మానివేసి యింకను నితరమార్గముకై వెదక దొడంగిరి. కాని వారికెట్టి మా ర్గములేవియు నగుపడకుండుటచే హతాశులైరి. ఇటులుండగా వారి యందొక రక్షకభటుడాత్మని చేతికర్రతో వారి శిరముపైనున్న మట్టిని పొడచిచూచెను. ఆ కర్రతాకుటచే వారి శిరముపైనున్న నల్లజనప రాయి యూడెను. అచ్చట బిలమేర్పడెను. వారు టార్చిలైటు కాంతుల నాబిలముగుండా నలువైపులకు ప్రసరించిరి. ఆ వెలుతురు నందు వారికొక గది కన్పించెను. వారందరా గదిని చేరిరి. ఆ గృహ మొక ధనాగారమై యుండుట గుర్తెరింగి మిగుల ఖిన్నవదనులైరి.

రక్షకభటులా ధనాగారమును పరిశోధించిరి. అందలి పెట్టె లన్నియు తెరువబడి యుండుట గాంచిరి. అందలిధనమంతయు నపహ రింపబడెను. చోరులా ధనాగారపు యినుపద్వారములను పగుల గొట్టి అందు ప్రవేశించినట్లు వారు కనుగొనిరి. అచ్చట కావలి గా యుచున్న రక్షకభటులందరు స్తంభములకు విరిచి కట్టబడియుండి బంధింపబడిన రక్షకభటులను కట్లనుండి విడుదల గావించిరి. ధనాగార

మంతయు దోచబడియుండెను. చోరులా ధనాగారమునుండి బయటకు పారిపోయిరి. అపహరించబడిన ధనమంతయు రమారయి యేబది వేలకు మించియుండెను.

సూపర్నెంటుగారి గృహమును సందపహరించ బడిన ఆస్తి రమారమి యిరువది వేలుండెను. చోరుల హస్తగతమైన ఆస్తి జరిగిన చోరీ వృత్తాంతము నంతయు రికార్డు నందెక్కించు కొనిరి. చోరుల జాడలరయుకై దక్షిణహిందూస్థానము నందంతయు వెదకదొడంగిరి.



## రంగూన్ మెయిల్



ఆరాత్రియే మోహన్ రావు ధనాగారముచెంతనుండి బయటకువచ్చి రాజబాటపై టార్చిలైటు ప్రసరింపజేసి చూచెను. అచటనొక కారాగినట్లు కనుపట్టెను. అంత గోపాలరావునుగూడ పిలిచి యా కారుటైరు గుర్తులననుసరించి బయలుదేరిరి. క్రమక్రమముగ నాగుర్తులవెంబడి రైల్వేస్టేషన్ జేరిరి. అచటనొక కారున్నది. ఆ కారుచెంతకేగి బాగుగ పరిశీలించిరి. దానికి నంబరులేదు. అందెవ్వరునూ లేరు. ఆ రైల్వేస్టేషన్ బుక్కింగ్ ఆఫీసుచెంతకేగి ఆబుక్కింగ్ క్లర్కు నిట్లుప్రశ్నించిరి.

మోహన్: యీ కారెవరిదండి.

బుక్కింగ్: యెవరో నంబరు 32 ప్యాసింజరుకు లాస్టుమూమెంటులో యీకారుమీదవచ్చి రైలెక్కిరి. అప్పటినుండియూ నీకారిక్కడనే యున్నది.

మోహన్: రైలుటికెట్లు యూరికి తీసుకొనిరో.

బుక్కింగ్: కాకినాడకు.

మోహ: యెన్ని?

బుక్కింగ్: మూడు.

మోహనుడా మాటవిని బుక్కింగ్ క్లార్కుతో శ్రమయిచ్చినందు లకు క్షమించవలసినదని కోరి కారుదగ్గరకు వచ్చెను. పచ్చబొట్టు తన మిత్రునితోడనూ నౌకరుతోడను కాకినాడ చేరెనని తలచెను. కాకినాడలో నాతడు స్వేచ్ఛగనుండునా? అట్లు సంచరించిన పోలీసు లు కనుగొని బంధింతురనుభయము లేకుండునా? కాదు. ఆతడు కాకి నాడలో నుండడు. స్టీమరుపై నెచటికో పారిపోవును. అని యిట్లుత ర్కించుకొనుచూ నాకారెక్కి కాకినాడకు ప్రయాణము సాగించిరి. అప్పుడే తెల తెలవారుచుండెను. కాకినాడ యెప్పుడు చేరుదుమో కాకినాడలో స్టీమరుబయలుదేరు సమయమెప్పుడో ఆతడు చిక్కు నో చిక్కడో అని యాలోచనతప్ప వేరాలోచన తోచుటలేదు. పాపము మోహన్‌రావుస్థితి "రెడ్డొచ్చె మొదలాడు" అన్నట్లున్నది. చేతచిక్కిన దొంగ తప్పించుకొని పారిపోయినాడు. కారు శరవేగ మున పరుగెత్తుచున్నది. మార్గమధ్యమున రోడ్డుపై నెట్టియాటంకము కలిగిననూ కారాగుట లేదు. కారు వేగమునకు రోడ్డుపైదుమ్ము కారుమేఘములవలె యాకసమును కప్పుచున్నది. క్రమక్రమము పది గంటలగునప్పటికి కారు కాకినాడచేరెను. తోడనే వారు సముద్ర పు రేవునకు చేరి విచారించిరి. ఆదినమున ఉదయము తొమ్మిదిగంట లకు "రంగూన్ మెయిల్" అనుస్టీమరు బయలుదేరినట్లు తెలియవచ్చి నది. ఆస్టీమరు యజమాని యెవరని విచారించిరి. అది రంగూన్ రౌడీ అని జగద్విఖ్యాతి వహించిన శంకర్రావు కుమారుడగు మోహన్ రావుదని తెలిసెను. వారచటకేగి మోహన్‌రావును కలసుకొని

మాటలాడిరి. ఆతడు బుక్కింగ్ క్లార్కును పిలిపించి యడిగెను. ఆతని గుమాస్తాయగు గోవిందరావు విని యిద్దరు యువకులు నల్లని దుస్తులు ధరించియుండిరి. వారితో నొకనౌకరుడు కొంతసామానుకూడ యుండెను. ముగ్గురూ కలకత్తాకు టికెట్లనుకొనిరి. అని చెప్పెను. ఆవాక్యమును విని మోహన్‌రావొక పెద్దనిట్టూర్పు విడిచి తిరిగి యాకారునే యెక్కి వెనుదిరిగెను.



## సుందర్ బన్



గంగావాహిని సాగరమును జేరుస్థలమునందు సుందర్ బన్ అనుగొప్ప అరణ్య మొకటి గలదు. ఆ యరణ్యమునందలి తరులతా గుల్మము లల్లిబిల్లిగా నల్లుకొనియుండెను. ఆ యరణ్యము నందొక్కొక్కచోట భానుని కిరణ జాలములు సైతము జొరబడుట కభేద్యమగునంత నల్లిబిల్లిగా నా పొదలు నల్లుకొని యుండెను. ఆ వనమునందు భల్లూక శార్దూల మదగజాది వన్యమృగములకు నివాసమైయుండెను. అందలి శార్దూలము రమారమి హస్తప్రమాణములుగల పొడవును, మూడున్నర అడుగుల యెత్తును గలిగి మిగుల పోకరించి యెవరికిని లెక్కచేయక సంచరించుచుండెను. సముద్రతీరమునందు నీటిగుర్రములు, మొసళ్లు, సీల్ అను ఒకవిధమగు మృగములతో నిండి యుండెను. నావికులను గూడా అప్పుడప్పుడీ జలచరము లాటంక పరచుచుండెను. తమ్లూకునకు పోవు పొగయోడలా మార్గముగుండా వచ్చుచూ బోవుచుండెను. అట్టి యంధకారమయమగు కాననము నందు చోరుల కునికిపట్టై యుండెను. అచ్చట చోరులు చిరు

తెప్పలపై సముద్రముపై నేగి తన్నూరుకునుండి వచ్చు పొగయోడలను దోచుకొనుచుండిరి. వేసవికాలమునందు ఓడలను దోచుటయు వర్షాకాలమునందు చేపలు పట్టుటయు వీరి ముఖ్యవృత్తులై యుండెను. కాని రానురాను వీరి సంఖ్య అభివృద్ధి నొందుటచే వీరికా పొగయోడల యందు లభించిన ద్రవ్యము చాలక చిన్న చిన్న పల్లెలయందు పడి దోచుకొన నారంభించిరి. వీరి దౌర్జన్యమునకు అంతు లేకుండెను. వీరప్పుడప్పుడు దారులనుకాచి బొడ్లీను కొల్లగొట్టి యిండ్లయందు జొరబడి గృహయజమానులను చంపి వారి ఆస్తుల నపహరించుట మొదలుగాగల క్రూరకృత్యము లొనర్చుచుండిరి. వీరిలో కొందరు చోరులు దొంగల ముఠా. మెట్టలనుండి పరారియై యిట జేరిన వారు గూడా వుండిరి. వేగల నెట్టనుండి పరారియైన వారందరునూ గూడ యిందే చేరిరి.



## భిక్షుకుడు



సాయంకాలము నాలుగు ఘంటలు కావచ్చెను. కలకత్తా నగరమున హారిసన్ రోడ్డను రాజబాట యాతాయాత జనసందోహమై యుండెను. మోటారుకారుల హారనుల ధ్వనులు, ట్రాంబండ్ల గంటల మ్రోతలు, జనుల కోలాహలములు మిళితమై సముద్రపు ఘోషవలెనుండెను. అచ్చటి రాజబాటయందలి అంగడులందు సరకులను కొనువారును సరకుల నమ్మువారును వారి వారి పనులందప్రమత్తులై యుండిరి.

హారిసన్ రోడ్డునందలి ఒక సౌధముచెంత భిక్షుకుడొకడు

"భిక్షాందేహీమాతా" అని అరచుచుండెను. కాని అతనికా గృహ మునుండి జవాబేమియు రాలేదు. లేదా ఆ యింటినుండి యెవరును యీవలికి రాకుండిరి. ఆ భిక్షుకునకు శరీరమందంతటను ముడుతలేర్పడియుండెను. అతడు చినిగిపోయిన మలిన వస్త్రములను ధరించి యుండెను. మన భిక్షుకుడున్న గృహముచుట్టూ నత్యున్నతమగు ప్రాకారమును ఆ యింటికి ముందరిభాగము నందొక రమ్యమగు పూలతోట గలదు. ఆతోటయందొక మూల ఘోటకశాలలును, వాటి ప్రక్క కారు షెడ్డును గలదు. యిటులుండగా క్రమముగా నారుగంటలకాలము కాజొచ్చెను. గాని ఆ భిక్షుకుడు మాత్రమటనుండి కదలక "భిక్షాందేహీ" యని యరచుచుండెను. అటులుండ నా గృహము నందలి విద్యుద్దీపములన్నియు నొక్కమారుగా వెలిగెను. ఆ దీపములు వెలిగినంతనే నా సౌధరాజమునందు విద్యుత్ పంకాలు తిరగజొచ్చెను. ఆ యింటికి పైభాగమునందు రేడియో అమర్చబడి యుండుటచే నందుండి మినర్వావారిచే ప్రదర్శించబడుచున్న (డక్కన్ క్వీన్) అను నాటకము వినిపించుచుండెను. ఆ యింటియందలి జనులందరా నాటకమును వినుటయందప్రమత్తులై యుండిరి. ఆ సౌధరాజము దేవేంద్ర భవనమువలె గన్పడుచుండెను. యిటులుండగా కొంతసేపటికి ఆ పట్నపు వీధులందు జనుల అలజడి తగ్గ నారంభించెను అంత నా భిక్షుకుడు తన చంకయందలి జోలెనుండి యేవో కొన్ని ఆకులు నీవలికి దీసికొని తన అర చేతియందుంచుకొని నలుప జొచ్చెను.

భిక్షుకుడా ఆకులను నలుపుట ముగించినంతనే ఆ గృహమునందలి వారందరు యెచ్చటివారచ్చట శవముల మాడ్కి పడియుండిరి. చనువరి ఆ భిక్షుకుండెవడో బహుశః మీరెరింగియే యుందురు. ఆ భిక్షుకుడు రాజబాట వీడి బహిర్ద్వారము నతిక్రమిం

సోపానముల గూడా క్రమముగా గృహములోని కేగ నారంభించెను. అతడా గృహములోని కేగి క్రింది భాగము నందున్న గదుల నన్నింటిని వెదక సాగెనుగాని వాటియందు దొంగని కేమియు లభించక పోవుటచే హతాశుడై క్రమముగా మేడనొక్క దొడంగెను. అతడు మేడపై కెక్కి అందలి గదుల నన్నింటి నొకదాని తరువాత నొకటిగా వెదక నారంభించెను. అటులొనరించు వెదకుచు అందొక గదియందొక యినుప మందసము గాంచెను. ఆ మందసము రమారమి రెండున్నర అంగుళుల యెత్తును, నాల్గున్నర అంగుళుల వెడల్పును గలదై యితరుల కభేద్యమగు నట్టుగా నుండెను. దాని పైభాగమునందొక బలమగు బీగము వేయబడి యుండెను. అంత నా భిక్షుకుండు తన జోలియందు మరుగు పరచిన సీసా నీవలికి దీసి అందలి ద్రావకము నా యినుప మందసముపై నొంపెను. వెంటనే పొగలెగయ జొచ్చెను. క్రమముగా నా మందసము పగుల దొడంగెను. ఆ మందసము పగిలిన వెంటనే భిక్షుకుడందు చేతులను జొనిపి అందలి ధనమును గొన్ని కాగితములను గొని తనజోలి యందు గుప్తపరిచెను.

తన కార్యమును ముగించిన దనుక మన భిక్షుకుడా గదిని వీడి ఒక సుందరమగు గదిని చేరెను. ఆ గది చూచుటకు కడు రమ్యముగా నుండెను. నా గది గోడలు పాశ్చాత్య స్త్రీల దిగంబర ఛాయా చిత్రములచే నలంకరింపబడి యొక వింత శోభను గూర్చుచుండెను. అందొక చోట నొక మేజా బల్లయు దానిపై నవనాగరికతను చాటు గాజు సామాగ్రు లుంచబడియుండెను. దాని గోడకు చేరువ నొక నిలువు టద్దముంచ బడియుండెను. మేజాకు నిరుప్రక్కల పేము కుర్చీలు వేయబడి యుండెను కుడి వైపొక పెద్ద పందిరి మంచమును దానిపై రెండు పరపులును రెండు తలగడలు వేయబడి యుండెను.

ఆ ప్రక్కపైన ననన్యసామాన్య తేజోవిలాసిని యగు నొక్క నవయౌవన మోహనాంగి నిద్రించు చున్నట్టుల చూపరులకు గన్పట్టుచుండెను. ఆ నవలావణ్య విలాసిని నిజముగా నిద్రించ లేదనియు మత్తుమందు ప్రయోగించుటచే చైతన్య రహితమై యుండెననియు మన భిక్షుకుండెరిగిన విషయమే. ఆమె మత్తుమందుకు లోనైయున్నప్పటికి ఆమె ముఖమండలము వికసించి యుండెను. భిక్షుకుడా యౌవనిని తన దృఢమైన చేతులపై నిడుకొని ఆ గదిని వీడి సోపానముల గుండా రాజబాట చేరెను. బలిష్ఠమగు నాతని హస్తముల యొత్తిడిచే ఆ కాంత మేనంతయు కమలి యెర్ర బారెను. తరువాత ఆమెను తన జోలియందు గుప్తపరచిన పెద్దసంచి నొకదాని నీవలికిదీసి ఆ బాలిక నా సంచియందుంచెను. చూపరులకు అది భిక్షమెత్తిన బియ్యపు మూటవోలె గన్పట్టు చుండెను. తరువాత నా భిక్షుకుడా మూటను గొని పెద్ద పెద్ద అడుగుల నిడుచు అదృశ్యుడాయెను.



## సంతర్పణ

ధరమ్‌తల్లా యందత్యున్నతమగు సౌధరాజంబొండుగలదు. ఆ గృహము పాశ్చాత్యపద్ధతి ననుసరించియు మిగుల మనోహరముగ నిర్మింపబడి యుండుటచే ముద్దుల మూటగట్టుచుండెను. ఆ యింటి ముందరి భాగమునందు బిచ్చగాండ్రు గుమిగూడి యుండిరి. ఆ మూకయందు కాళ్లులేనివారు, చేతులు లేనివారు, కుంటివారు, గ్రుడ్డివారు బాలురు, వృద్ధులు, స్త్రీలు పురుషులు మొదలుగాగల నానారీతుల వారుండిరి. ఆ నిరుపేదలు తమ బిచ్చపు పాత్రలను తమ కడనుంచుకొని వారి కొసంగబోవు అన్నదానమునకై యెదురు చూచుచుండిరి. ఆ జనసమూహము నడుమ నొక యెత్తగు నాసన ముండెను. అది మిగుల మనోహరముగా దంతముచే నిర్మింపబడి యుండెను. అచ్చటచ్చట బంగారపు పోడులు బిగించబడి యుండుటచే నా పీఠము మిగుల మనోహరముగా నుండెను. ఆ పీఠముపై ముఖమల్ గుడ్డలు వేయబడి యుండెను. ఆ యాసనము నందొక స్త్రీయు పురుషుడును కూర్చుని యుండిరి. ఆ స్త్రీ ముఖమండలము మిగుల కళావంతమై యుండెను. పురుషుడు సహజ గాంభీర్య వక్షస్థలముతో మిగుల సాత్వికుని వలె గన్పట్టుచుండెను.

వారిరువురచ్చటి నిరుపేదల నందర సాదరముతో సత్కరించుచుండిరి. ఆస్థలమునకు జనులు విసుగు విరామము లేకుండా వచ్చుచూ పోవుచుండిరి. ఆపీఠముపై నాశీనులైయున్న యిరువురిలో నొకతె స్త్రీ. అక్కాంత ఒక్కొక్క నూతనవస్త్రము నా పురుషున కందజేయుచుండెను. ఆపురుషుడును దానినందుకొనుచు నొక్కొక్క పేదవాని కొసంగుచుండెను. ఆ పేదవారా వస్త్రముల నందు

కొని సలాము చేయుచూ మరల వారి-చోటులకేగి కూర్చొనుచుండిరి. ఆభిక్షుకులకు వస్త్ర దానానంతరము ధనము పుష్కలముగా పంచి పెట్టిరి. ద్రవ్య దానానంతరము పంచభక్ష్య పరమాన్నములతో నన్నదానము చేయఁబడెను. అన్నదానానంతర మాపేదలా దంపతులను వేనోళ్ళ శ్లాఘించుచూ మెవరిగృహములకు వారేగిరి. ఆదంపత ద్వయము నిరుపేదలకై వ్యయపరచిన ధనము రమారమీ యిరువది వేల రూప్యములకు మించియుండునని అంచనా వేయబడెను. ఆదాన సంభ్రమానంతర మాదంపతులు వారిగృహములకు మిగుల ఆనందముతో మరలిరి. పరిచారకులంద రెవరియిండ్లకు వారేగిరి. ఉదారశీలురగు నాదంపతులెవరో గనుగొనుటకై ప్రజలు మిగుల ఆందోళన మొందసాగిరి గాని వారు అపరిచితులగు వ్యక్తులగుటచే వారెవరో యెరుంగజాలరైరి. ఆనాటిరాత్రి యెచ్చటచూచినను యీ వృత్తాంతమే జెప్పుకొనసాగిరి. కలకత్తాపౌరులంద రాతని దానశీలతకును ఉదారభావమునకును మిగులగొనియాడిరి. వర్షములు కురియకపోవుటచేత నప్పుడు మిగుల కాటకముగా నుండెను. అట్టి భయంకరమగు కాటకపుదినములలో తిండిలేక యెండుటాకులరీతిని నలమలమాడి పోవుచున్న నిరుపేదలకు పుష్కలముగా నన్నదాన మొనర్చిన దానకర్ణుని దానశీలతను మిగుల శ్లాఘించుచూ నాతనికి సర్వేశ్వరుడు మేలుగూర్చుగాక యని అందరు సర్వేశ్వరు నేకగ్రీవముగా ప్రార్థింపసాగిరి.

## మోహన్ రావు బంధి



రాత్రి రమారమి తొమ్మిది ఘంటల వేళై యుండును. గాలి బోరుమని వీచుటచే రాజబాటముందలి వృక్షములూగకొంచంగెను. ప్రకృతి యంతయు నిశ్శబ్దముగానుండెను. గగనమందు తారకావళు లేవియు లేకుండుటచే జలనిధిగర్భమువోలె గగనభాగ మందంతయును కారుచీకటు లలముకొని యుండెను.

అట్టి నిబిడాంధకారమునం దిరువురు పురుషులు పాదచారులై కాలిఘాట్ వైపు చుర చుర నడిచి పోవుచుండిరి. వారిరువురి కాయములు మిగుల బలిష్టములై పెరిగి యుండెను. వారు మాటి మాటికి వెనుకకు దిరిగి చూచుచూ మధ్యమధ్య నాగుచూ మరల ముందరికి ప్రయాణము సాగించు చుండిరి. చిన్న చప్పుడేదియో వినబడుటచే నెవరో తమ్మనుసరించు చున్నట్లు తలంచి అటుకొంత సేపాగి మరల ముందరికి నడువ జొచ్చిరి. వీరి నడక ప్రారంభింప బడిన తోడనే వెనుకనుండి మనుజుల పదములధ్వని వినవచ్చు చుండెను. ముందర నడచుచున్న వారలాగినతోడనే వెనుకనుండి వచ్చుచున్న పదధ్వని అంతమగుచుండె. మరల ముందరియువకులు నడచుట ప్రారంభ మొనర్చినతోడనే వెనుక పదధ్వనులు వినవచ్చుచుండెను. వారు తమ్మెవరో అనుసరించినటు లనుమానపడి మిగుల జాగరూకతలో పయనము సాగించుచుండిరి. కొంతకాలము ప్రయాణము సాగించిన దనుక కాళీఘాటునందొక పెద్ద యింటిముందర నాగిరి. బహుశా నదియే వీరి గమ్యస్థానమై యుండును. ఆ మేడముందరి భాగమునందొక దీపము మినుకు మినుకుమనుచూ వెలుగుచుండెను. ఆదీపపు వెలుగునందు వారిననుసరించుచున్న యువకులు వారినిగాంచిరి. వారు

నల్లని దుస్తులను శరీరమునకు దొడగికొని యుండిరి. వారి ముఖము లకు నల్లని బురకాలను గప్పుకొనియుండిరి. అందుచేత వారినిగుర్తె రుంగజాలకుండిరి. వారిలోనొకని హస్తమునందొక భారమగుసంచి యుండెను. వారా సౌధమున ముందరి ద్వారముగుండా ప్రవేశిం చుటకు శంకించి ఆయింటి వెనుకభాగమును చేరిరి. వారేగుసరి కా ద్వామలు మూయబడియుండెను. అందు వారొకరి సహాయమున నొకరాగోడను దాటి లోనికేగిరి. అంత లోపలిభాగమున వారిరు వురకీ క్రిందిరీతిని సంభాషణ జరుగుచుండెను. వీరి సంభాషణమం తయు వారిననుసరించి వచ్చినవారు పొంచి వినసాగిరిగాని వారి కస్పష్టముగా వినవచ్చుచుండుటచే సరిగా నాలకింపజాలక పోయిరి.

మొదటివాడు: మన మీ గదుల నన్నింటిని బాగుగా వెదకినగాని లాభము లేదు.

రెండవవాడు: మనమాతడుండు తావెరుగము. అందులకుఅచ్చటి గదులనన్నింటి నొకదానితరువాత నొకటిగా వెదకినగాని మనమాతనిని పొందజాలము. గాన సత్వరముగా నీకార్యము ముగింపవలయును.

మొ: యీ గదికి తాళము వేయబడి యున్నదే.

రెండ: అవును దీనికి ఆరు లీవర్ల తాళము వేయబడినది. దీనిని మన మెట్లైన ఛేదింపవలయును.

మొద: నీవు పరికరములను గొనివచ్చితివా లేక మరచి వచ్చితివా?

రెండ: నేనట్లుమరచివచ్చువాడనుగాను. నీ వొసంగిన పనిముట్లు నీ సంచియందు భద్రపరచి గొనివచ్చితిని.

మొద: నీవా తాళమును పగులగొట్టుము. నే నితరులు రాకుండా కావలి గాయుచుండెదను.

వారిలో నొకడా బీగమును పనిముట్ల సహాయమున బ్రద్దలు

గొట్టెను. వారా తాళమును పగులగొట్టి ఆ ద్వారములను తెరచి ఆ గదియందు ప్రవేసించిరి. ఆ గదిని చూచుసరి కందు వంటసామాగ్రులుదక్క మరేమియు లేక పోవుటచే మిగుల విచారించి ఆ గదిని దాటి మెల్లగా నడుగుల నిడుచూ మరియొక గదిని చేరి.

ఆగదియందా గృహమునందు పనులను చేయుచుండు పరిచారకులు శయనించి యుండిరి. వారొకదానితరువాత నొకటిగా పది గదులను వెదకిరిగాని వారికేమియు లభించలేదు. తుదకొక గదినిచేరి అందొకశయ్యపై శయనించియున్న ఒక అరువదియేండ్ల వృద్ధునిగాంచిరి. ఆవృద్ధుడును గాఢనిద్రా పరవశుడైయుండెను. ఆతని శరీరమంతయు ముడుతలు పడియుండెను. వారా శయనించియున్న వృద్ధుని చేరి ఒకడు కదలకుండా యుండునటు లదిమిపెట్టెను. రెండవవాడాతని నోటి గట్టిగా నరవజాలకుండునటు లదిమిపట్టి కత్తితో వక్షస్థలముపై పొడచెను. ఆముసలిని హతమార్చిన వెనుక నాహంతకులా మృతకళేబరము నీవలికిగొనివచ్చి యింటివెలుపలి భాగమునందొత్తుగా పెరిగిన గడ్డిబైలునందు విడిచి మరల నాయింటిలోనికి ప్రవేశించిరి.

ఆ యింటి యందలి పెట్టెల నన్నింటిని వెదకిరి. తుదకొక పెట్టెయందు వారికి కొంత ద్రవ్యము లభించెను. వారా ద్రవ్యమును తమ సంచియందు భద్రపరచి పెరటి ద్వారములను తెరచి ఆమార్గము గుండా వెడలి పోవుటకు సంసిద్ధులై యుండిరి. అంతలో హటాత్తుగా నొకవ్యక్తి వారిపుపరిపై గలియబడెను. వారు ముప్వురు ఘోరముగా పోరాడిరి. ఆ నూతనాగంతకుడు ప్రసిద్ధ పత్తేదారు గారగు మోహనరావుగా నా చోరులెరింగి ఆతనితో ఘోరముగా పోరాడిరి. మోహనరావుగూడా సాయశక్తుల వారితో పోరాడెను గాని చోరు లిరువురును తా నొక్కడేయై యుండుటచే చోరులు

మోహనరావుని బంధించి గొనిపోయి సుందర బన్ అను మహా రణ్య మధ్యనున్న వారి గూడెమును చేరి మోహనరావు నొక గదియందు బంధించి వైచిరి.



## అనాధ బాలిక



చోరులగూడె మందొక గదిలో మోహనరావు బంధింపబడి యుండెను. అనుదిన మాతనికొక యువకుడు భోజనమును గొనివచ్చి యొసంగు చుండెను. మోహనరావా భోజనసామాగ్రిని తినుట కయి ష్టుడై నప్పటికిని ఆకలి బాధకు తాళజాలక కొంచెము మాత్రము భుజించుచూ మిగిలినదాని కిటికీద్వారా పారవైచుచుండును. మోహ నరావుగా రుంపబడిన గది రమారమి మూడు గజముల పొడవును పది అడుగుల యెత్తును గలదై యుండెను. ఆ గదికొక్క ద్వారము మాత్ర ముండెను. ఆ ద్వారము భోజన సమయమందు దక్క తదిత ర సమయము లందు మాత్రము బంధింప బడియుండును. ఆ గదియం దు గాలియు వెలుతురు వచ్చుటకై భూమినుండి తొమ్మిదడుగుల యెత్తునందు మాత్రమొక కిటికీ యుండెను. యీ రీతిగా బాధలను భరించుచూ వారొసంగిన ఆహార పదార్థములను తినుచూ పది దివ సంబులకాలము వెళ్ళబుచ్చెను. మోహనుండందుండెనేగాని సర్వ కాల సర్వావస్థలయందు తన విముక్తి కై తగు నుపాయముల నాలో చించుచునే యుండెను.

యిటు లుండగా నొకనాడాతని చెవుల కార్తనాద మొకటి వినబడెను. ఆనాదము స్త్రీ కంఠమువలే నుండెను. బాగుగా పరిశీ

లించిచూడగా తనప్రక్క గదినుండి యాధ్వని వచ్చుచున్నటుల గనుంగొని తన గదియొందలి ద్వారముపై కెక్కి చిన్నకిటికీద్వారా పైకిచూచుచుండెను. ఆతని దృక్పథమునందొక చిన్నగదిపడెను ఆగదియందొక బాల బంధింపబడియుండెను. ఆమె శరీరము మిగుల శుష్కించి శల్యమై యున్నప్పటికిని ఆమెను గాంచినవారు తప్పక పరవశులగుదురని చెప్పుటకెంతయు నతిశయోక్తిగాదు యేలయన ఆమెమిగుల అందములరాశి. ఆమె ముఖమండలము సుగ్గుల మూటగట్టుచున్నట్లుగా నుండెను. లేతగులాబి వర్ణముగల శరీరచ్ఛాయయును విశాలమగు నయనద్వయమును దొండపండును బోలు నామె అధరము నాకాంత కొకరీతి నూతనశోభను దెచ్చుచుం డెను. ఆ సమయమున నందొక పురుషుండు కాంతకాహారమును గొని వచ్చి అందు బంధితురాలైన స్త్రీని గొన్ని ప్రశ్నలు నడుగుచుండెను. వారి క్రింది రీతిగా ప్రసంగించిరి.

పురు: నాకు నిన్ను పెండ్లాడవలె నని యున్నది. అందులకు నీ అభీష్ట మేమి?

స్త్రీ: నరాంతకుడును ఘోరపాపివగు నిన్నా నేను వివాహమాడు నది?

పురు: నీవు నన్ను చేపట్టని పక్షమున నిన్ను ఖడ్గమున కెర యొనర్చెదను.

స్త్రీ: నీవు నన్నే మొనర్చిన నొనర్తువుగాక. కాని నా కంఠనాళము నందు ప్రాణములున్నంత వరకు నీవు నన్నంటజాలవు.

పురు: నీకు రెండు మాసములు వ్యవధి నొసంగితిని. యీలోపుగా నీ వాలోచించి నీ యభీష్ట మేదియో తెల్పుము. అని యా పురుషుడా కాంతను వీపుపై నొకతన్నుతన్ని ఆ గదిని వీడి ద్వారమును బంధించి వెడలి పోయెను.

బాలి: హా జగదీశ్వరా, ఆర్తత్రాణ పరాయణా, సర్వేశ్వరా ఆపత్ బాంధవా! యీ దీనురాలి మానము గాపాడవా? ఈ నరక కూపమునుండి నన్ను విముక్తి యొనర్చు పుణ్యాత్ములు లేరా? లోక మంతయు గొడ్డువోయినదా యనుచు నాబాలిక రోదన చేయసా గెను. మోహనరావు యింతదనుక ప్రక్కగదినుండి యా వృత్తాం తమంతయు వినుచుండెను. అట్లు ఏడ్చుచున్న స్త్రీ రత్నమెవరో, ఆమె నెందులకు వారు బంధించిరో అని తలంచుచూ ఆమెనుచేరి ఆమెతో సంభాషించుట కనువగు మార్గములను వెదకసాగెను.

పత్తేదారు తన గదియందలి యూచల నొకదాని తరువాత నొకటిగా విరుగగొట్ట నారంభించెను. ఆ ప్రయత్నమునందొక యూచ విరిగి అతని చేతిని గాయపరచెను. రుధిరమేక ధారగా కారుచుండెను. గాయమునకు కట్టుగట్టి మెల్లగా నా కిటికీపై కెక్కి ఆ బాలికయున్న గదియందు ప్రవేశించెను. మోహను గాంచినతోడనే నాబాలిక అతనిని హంతకునిగా నెంచి మిగుల భీతిచెందెను గాని మోహనరా వా వైభయమును పారద్రోలెను. అతడేడ్చుచున్న బాలికను గాంచి యోదార్చి ఆమె వృత్తాంతమంత యడిగెను.

మోహన: అమ్మాయి, నీవు బంధింపబడుటను గల కారణమేమి?

బాలిక: హంతకుని సేవకునకు నన్నిచ్చి పరిణయము చేయవలెనని నన్ను గొనివచ్చి యిందు బంధించిరి.

మోహ: ని న్నెన్నిదినములైనది వారుగొనివచ్చి?

బాలిక: రమారమి మూడుమాసములు కావచ్చుచున్నది.

మోహ: నీ వృత్తాంతమంతయు నేను వినవచ్చునా?

బాలిక: వినుట కేమున్నది? తెల్పెదను వినుడు. నేను కలకత్తానగర మం దధికసిరులతో దులదూగు నొక పార్శీయువకునింట బుట్టి అధిక గారాబముతో పెంచబడు చుంటిని. యిట్లుండగా

ఒకనాటిసాయంకాల మొకచోరుడు మాయింటికి వచ్చి నాకు మత్తుమందు ప్రయోగించి, మా యింటియందలి ధనరాసుల నన్నింటి నపహరించి నన్ను గొనివచ్చి యింత బాధించెను. అప్పటినుండియు నాకు సరియగు ఆహార మొసంగక తన సేవకుని వివాహమాడమని బాధింప మొదలిడిరి. యిదియే నావృత్తాంతము. తమరెవరో నే నెరుంగవచ్చునా?

మోహ: నే నీ ప్రాంతములందు పేరువడసిన పత్తేదారుడను. నన్ను మోహనరావందురు. నమానమీ రెండు సంవత్సరముల నుండి యీ కేసునందు పనిచేయుచు వీరిని పట్టుటకై ప్రయత్నించుచుంటిని. యిట్టిదినా ఒకనాడు హఠాత్తుగా నన్ను బంధించుటకు వచ్చిరి. నిన్నెట్లైన విడుదలచేయు బాధ్యత నాపై నున్నది గాన నీవేమియు భయపడవలదు.

బాలిక: మీరు నా పాలిటి దైవముగా కనుపడుచున్నారు. మీరు నాయెడల మిగుల వాత్సల్యమును చూపి నన్ను రక్షించ గోరుచున్న మీ ఋణ మెట్లు తీర్చుకొనగలనో గదా.

మోహ: నీ విడుదల అగువరకు నేను నిద్రాహారములను సహితము మాని నీ యోగక్షేమములకై పాటుపడెదనని నేనిదే ఘంటాపథముగా పల్కుచున్నాను..

బాలి: హంతకుడు చతురుడు, యుక్తిపరుడు, మాయలమారి, బలసంపన్నుడు, క్రూరుడు. నన్ను గూర్చి నిప్పుమాత్రము వాని ఖడ్గమున కెరగాకుము. సదామిగుల జాగరూకతతో మెలంగుచూ మన విమోచనకై పాటుపడవలెను.

మోహ: సరియే నా ప్రాణము విషయమై నీవు చింతిల్లకుము. నీ ప్రాణముకన్న నా ప్రాణము గొప్పదియా? నాకేమియు కీడు వాటిల్లదు. నీవు నిశ్చింతగా నుండుము.

---

వోగులటకు దూరముగా నేగినప్పుడు మోహనరా వనుదినమూ కిటికీగుండా నా బాలికయున్న గదిలోనికేగుచూ ఆమెతో యిష్టాగోష్ఠి మాటలాడుచూ కొంచెము హంతకుల యలజడి వినబడిన తోడనే మరల నాకిటికీగుండా తనగదిని చేరి యూచల నెథాప్రకారముగా కిటికీకమర్చి యేమియు నెరుగనటుల తన గదియందు కూర్చొని యుండెను.

ఇటులుండగా నొకనాడతడు బాలికయున్న గదియందు కూర్చొనియుండి ఆవలికేగుమార్గమును గూర్చి యోజించుచుండెను. అంతలో నాతనిదృష్టి ఆ యిటికెగోడలపై బడెను. అవిమిగుల పురాతనమైన వగుటచే అచ్చటచ్చట గోడలపై వేయబడిన సున్నము పూర్తిగా యూడిపోవుటచే రాయిమాత్రము స్పష్టముగా నగుపడుచుండెను. అట్టిశిథిలావస్థయందున్న గోడలను చూచునప్పటికాతనిమనస్సున కేదియోతట్టుటచే చటాలున కూర్చున్న స్థలమునుండి లేచి దేనికొరకో నా గదిని వెదకసాగెను. కొంతసేపాతడట్లు వెదకునప్పటికా గదియందాతని దృక్పథమునందొక త్రుప్పుపట్టిన యినుప యూచయొకటి పడెను. అతడా యూచను గైకొని అనుదినమాగోడయందలి పెద్ద రాతిబండ చుట్టూయున్న సున్నమును గీచివేయుచు క్రిందపడిన సున్నమును తన అంగీయందు వైచుకొని కిటికీనెక్కి దానిగుండా నావలికి పారవేయుచుండెను. యీరీతిగా రెండు మూడు దినములు కొనసాగ్చసరి కాబండ నావలి కూడ బెరుకుటకు వలను పడునంత ఖాళీ యేర్పడెను. మెల్లగా నాబండను తనశక్తినంతటి నుపయోగపరిచి యీవలి కూడ బెరికెను. అందొక మనుజుడు ప్రవే

మొనర్చుట కనువగు సంతబిలమేర్పడెను. ఆ బిలముగుండా మోహా నరా వావలికి తొంగి చూచెను. ఆతని దృక్పథమునందొక అరణ్యా ము గోచరించెను. ఆ యడవియందు వృక్షములు మిగుల ఒత్తుగా పెరిగియుండెను. తనకు మార్గము లభించినందులకు మనమున మిగుల నుప్పొంగుచూ నాబండను యథాస్థానము నందుంచి ఆబాలికతో తమ విముక్తి మార్గము లభించిన విషయము నెఱింగించెను. ఆ బాలికయు మనమున మిగుల సంతసించెను. సంభాషణానంతరము యథారీతిని కిటికీగుండా తనగదిని చేరుకొనెను. మామూలుప్రకారమొకయువ కుడా యిరువురకాహారపదార్థము లొసంగి ద్వారములను బంధించి వెడలిపోయెను.

ఇటులైదారు దినములు గడచెను. వారు సరియగు సమయమునకై వెదకుచుండిరి. ఒకనాడు సాయంకాలమున చోరులలో చాలామంది దోచుకొనుట కేగిరి. మోహానరావా దినము శుభదినముగ నెంచి రాత్రిపది వరకు వేచియుండెను. క్రమముగా రాత్రి పది గం టలు కాజొచ్చెను. గృహమంతయు సంధకారావృతమై యుండెను. తన గదియందుంచబడిన చిన్న ఆముదపు దీపమాగదియందలి అంధ కారమును చాలా వరకు పారదోలుచుండెను. అట్టి అర్ధరాత్రము నందు మోహానరావు చోరునిభంగి తన గదిని వీడి ఆ బాలిక యున్న గదిని చేరెను. మోహానుడేగుసరికా బాలికయు శయనించి యుండుటచే నామెను మేల్కొలిపెను. ఆ బాలిక మేల్కాంచి మోహానుని గాంచి మిగుల సంతసించెను. మోహానరావా రాతి బండను చప్పుడు చేయకుండా మెల్లగా నీవలి కూడబెరికెను. అంత నచట రంధ్రమొకటేర్పడెను. మిగిలిన చోరులప్పటికే గాఢ నిద్రా పరవశులై యుండుటచే మోహానరావా బాలికను గొని ఆ బిలము గుండా గదిని దాటి రాతి బండ నెథాస్థానమందుంచి వారిరువు రా

నరణ్యముగుండా ప్రయాణము సాగించిరి. ఆ యడవియందు ముందు కేగుటకు మార్గము దొరకుట దుర్లభమై యుండెను. అచ్చట ముండ్లకంపలు, పల్లేరు, నారికేళ వృక్షములు మెండుగా పెరిగియుండుటచే వారి పాదములకు ముండ్లు గుచ్చుకొనుచుండెను. వారి అరికాళ్ళయందు విరిగిన ముండ్లపరిమితియే లేకుండెను. మధ్యమధ్య పులుల బొబ్బలు, యేనుగుల ఘీంకారములు వినవచ్చుచుండుటచే నా బాలిక భయముచే వడకుచూ మోహనరావు చేతిని గట్టిగా పట్టుకుని మెల్లగా పదములిడుచూ నడచుచుండెను.

చోరులు తమ్మనుసరించుచున్నారేమోయని మాటిమాటికి వెనుకను చూచుచు, ముందరిమార్గమును వెదకుచూ క్రూరమృగముల అరుపులు వినబడినతోడనే ఆ బాలిక భయపడకుండా ధైర్యము చెప్పుచూ నీకీతిగా కొండలు చిన్నచిన్న గుట్టల నతిక్రమించుచూ అంధకారముగుండా యడవిమార్గముగుండా రమారమి యిరువది మైళ్ళదూరము నడచిరి. పాపమా బాలిక తనజన్మమునందింత దూరము నడచియెరుగదు: ఆమె అరికాళ్ళు మృదువులగుటచే పెద్ద పొక్కులెక్కెను. ఆ బాలిక నన్నింటినీ సరకుసేయక మోహనరావును వెంబడించెను. తెల్లవారుసరికి వారు మోహనుయిల్లు చేరిరి. మోహనరావామెను తనయింటియందుంచి మంచిఆహారము లొసంగుచూ జాగరూకతతో గావళి గాయుచుండుటచే నామెశరీరము పూర్వమువలే నుండెను.

## చోరుల బంధి



కలకత్తా రక్షకభటులు తమఅధికారుల అనుమతుల ననుసరించి వారు తమతమ పనులందప్రమత్తులైయుండిరి. కొందరు బయనట్లను కత్తులను బల్లెములను సానబెట్టుచుండిరి. మరి కొందరు తుపాకులను రివాల్వరులను శుభ్రము చేయుచుండిరి. కొందరు మనఫిరంగులు తృప్పుపట్టి యుండుటచే నూనె ప్రాసి తుడుచుచు చుండిరి. యీ రీతిగా నచ్చటనున్న రక్షకభటులందరు వారివారి పనులందప్రమత్తులై యుండిరి.

సుప్రసిద్ధ పద్దేదారుగారగు మోహనరావుగారును, కొత్త సూపరెంటుగారగు స్మిత్తు దొరగారును సర్కిలిన్స్పెక్టరుగారగు నారాయణరావుగారును యింకను తదితర రక్షకభటాధికారులను తమ ఆఫీసుగదియందు సుఖాసీనులై యుండి చోరులను పట్టురీతిని గూర్చి యిష్టాగోష్టిని ముచ్చటింప సాగిరి. యిట్లు వారొకటి రెండు గంటలు ముచ్చటించిన దనుక వారి సంభాషణ చాలించి యెవరిండ్లకు వారేగిరి.

ఆ దినపు సాయంకాల మూరుగంటలకు వారందరు ప్రయాణ సంసిద్ధులై యుండిరి. రక్షభటులు వారి యధికారులతో గలసి సుందరబన్ వైపు ప్రయాణము సాగించిరి. రక్షకభటులందరు మిగుల నుత్సాహ పూరితులై యుండిరి. ఆ యడవియందు పేను, మద్ది మ్రాకు లాకసము నంటుచున్నవో యనునట్లొప్పుచుండెను. నానా జాతుల లతలు అల్లిబిల్లిగా నలముకొని యుండుటచే నా రక్షకభటులా తీగెలను తమ చేతులందలి కరవాలములచే నరకుచూ తాము ముందుకేగుటకై మార్గము చేసుకొనుచూ నా బాటగుండా అరణ్యా

మధ్యాంబునందుండి నడువసాగిరి. మార్గము నందచ్చటచ్చట తేనె పట్లు గానవచ్చెను. మరి కొంత దవ్వేగుసరికి బాగుగా పండిన పనస జాను, మామిడి మొదలుగాగల పండ్ల వృక్షములు గానవచ్చుటచే నా రక్షకభటులచ్చటి వృక్షముల నెక్కి పండ్లను గోసుకొని తమకు యిచ్చవచ్చిన రీతిని భక్షించుచుండిరి. అచ్చటచ్చట అడవియందు సన్నజాజి, సంపెంగ, అడవిమల్లి పూచియుండుటచే తియ్యని వాసన వారి నాశికారంధ్రములను దాకుచుండెను. యింకను కొంత దవ్వే గుసరికి ఒక కొలను వారి ముందర గాన్పించెను. ఆ చెరువుగట్టుపై మయూరములు తమ పురులను విప్పుకొని మనోహరముగా నాడు చుండెను. వీటి నన్నింటిని గాంచి వారు సర్వేశ్వరుని సృష్టి నెంతయో గొనియాడిరి. యీ రీతిగా వారు నడచుచుండుసరికి చీకటి పడుటచే నా యరణ్యమంతయు మిగుల నంధకారమయమై యుండెను. ఒకరి మొగములొకరికి గానరాకుండెను. రక్షకభటులు వారి హస్తము లందలి దొంగలాంతరుల సహాయమున ముందరి మార్గమును వెద కుచూ నడువసాగిరి. అరణ్యమునందలి శరభ శార్దూలాది వన్యమృ గములు తనుతమ ఆహారమును వెదకుటకై బయలుదేరుచుండెను. ఆ మృగములు మిగులనాకలి గొన్నవగుటచే నాకలి బాధకు తాళ జాలక మధ్యమధ్య గర్జించుచుండెను. శార్దూలముల గర్జనలు ప్రతి ధ్వనించుచూ మిన్ను ముట్టుచుండెను. పోలీసువారు తమ మార్గమున కడ్డము వచ్చిన జంతువులనన్నింటినీ హతమార్చుచుండెను. అచ్చటి మృగములా తుపాకుల ధ్వనులకు వెరచి గృహములందు దాగుటకై పరుగెత్తసాగెను. రక్షకభటులు ఈ రీతిగా జంతువులను వేటాడుచూ వినోదముగా నడచి తుదకు చోరుల గూడెమును సమీపించిరి. చోరుల కగుపడకుండా రక్షక భటులందరచ్చటి గుట్టలందును పొదలందును దాగియుండిరి.

చోరులీసంగతి ముందెరింగిన వారగుటచే మిగులజాగరూకులై మెలగుచుండిరి. వీరిలో కొందరు తుపాకులను రివాల్వరులను ధరించి అశ్వారూఢులై యుండిరి. కోయవారు విల్లమ్ములను ధరించి పొదలమాటులందు డాగియుండిరి. చోరులున్న స్థలములను గుర చూచి రక్షకభటులు తుపాకులను ప్రేల్చ నారంభించిరి. చోరులు బాణములను వదలసాగిరి. తుపాకులధ్వనులు మిన్నుముట్టుచుండెను యిరుపక్షములవారికి పోరు విపరీతముగా జరుగుచుండెను. ఫిరంగులు ప్రేల్చుటచే పొగ వేయజొచ్చెను. యిరుపక్షము వారా పొగయందు మునిగియుండి యితరుల కగుపడకుండా కొంతసేపటివరకు నుండిరి. కొంతసేపటికి ధూమము తగ్గుటచే నిరుపక్షములవారు స్పష్టముగా గానవచ్చుచుండిరి. యిట్లు కొంతసేపు పోరుజరిగెను. తుదకు చోరులవద్దనున్న తోటాలు ముగియుటచే రక్షకభటులకు వశులైరి. చోరులందరికి నినుప శృంఖములను రక్షకభటులు దగిలించి వారి నడుములకు బలమగు త్రాళ్ళను గట్టిరి. చోరనాయకీ నాయకులింకను పట్టుబడక పోవుటచే వారిరువురు పరుగున నేగి వారిగూడెమునందు ప్రవేశించి గూడెమున కగ్నిసంస్కారము గావించెను. మంట లాకసము మీదికి పెద్దకొనలతో నెగయజొచ్చెను. యింతకుమున్న సమస్తసిరులతో తులతూగుచూ మహారాజ భవనముబోలె నొప్పుచున్న చోరుల గూడెమంతయు నవనియందు లీనమయ్యెను. యీ ఘోర సమరమువలన నుభయపక్షముల వారును చాలావరకు తమ, తమ ప్రాణములను గోల్పోయిరి. మిగిలినవారు రక్షకభటులకు వశులైరి. మోహనరావుగారును స్మిత్తు దొరగారును అమాంతముగా నా చోరనాయకులపై బడి బంధించిరి. వారి హస్తములకు గూడా బలమగు బేడీలు వేయబడెను.

రక్షక భటులా చోరులగూడెమంతయు జాగరూకతతో వెదకిరిగాని ఆ పురమింతకు పూర్వమే అగ్నిదేవుని కెరయగుట నందు వారికేమియు లభించలేదు. రక్షకభటుల హస్తగతులైన చోరులను వారు తమవెంట నిడుకొని కలకత్తా సెంట్రల్ జైలునకు ప్రయాణము సాగించిరి. వారు మార్గమునందు చోరులను బహుజాగరూకతతో గావలిగాయుచు నడచుచుండిరి. ముందరిభాగమున వారి అధికారులును మధ్యభాగమునందు చోరులు, వారి వెనుక భాగమందును, కుడి యెడమ ప్రక్కలందు రక్షకభటులు కడుజాగరూకులై కావలిగాయుచు చోరులను పారిపోకుండా నుండునటుల మిగులఅప్రమత్తులై మెలంగుచుండిరి. వారాయరణ్యమార్గముగుండా ప్రయాణము సాగించి తుదకు సాయంకాలమగుసరికి కలకత్తా సెంట్రల్ జైలునుచేరి అందువారి నందరను బంధించి మరునాడుదయము వరకు మిగుల జాగరూకతతో గావలి గాయుచుండిరి.



---

మరునాఁడుదయము పదిఘంటలు కావచ్చెను. ఎండ తీక్ష్ణముగా గాయుచుండెను. మధ్యమధ్య వేడిగాలులు వీచుచుండెను. అట్టి సమయమునందు మేజిస్ట్రేటుగారి కచేరియందు జనులు గుమిగూడి యుండిరి. అందు స్త్రీలు, పురుషులు ఆబాలగోపాలమంతయు వచ్చటనే యుండెను. వచ్చుచూ పోవుచుండు జనులకు మితియే లేకుండెను. అదియునుగాక చలనహేతుశకటములు, ద్విచక్రశకటములు, గుర్రపుబండ్లు మొదలుగాఁగల వాటికి మితియే లేకుండెను. అచ్చట జేరియున్న జనసమూహమంతయు చోరుల విషయము చెప్పుకొనుచూ డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుగారి రాకకై యెదురుచూచు చుండిరి. వారింకను రాకుండుటచే విసుగెత్తి కొందరు వారి యిండ్లకేగి భోజనానంతరము మరలి వచ్చుచుండిరి. కొంతసేపటికి నొకమోటారు కారు మేజిస్ట్రేటుగారి కచేరివైపు వాయువేగముల వచ్చుచుండెను. ఆ శకటము క్రమముగా ముఖ్యద్వారముగుండా కోర్టు ఆవరణలోనికి ప్రవేశించి కోర్టుముందర నాగెను. అందుండి మేజిస్ట్రేటుగారు దిగి కచేరి లోనికేగసాగిరి. అచ్చటి మూకను దూరముగా తొలంగించుచూ నాతనికి మార్గ మొనరింప సాగిరి. యితని రాకమూలమున నింతకు పూర్వము కోలాహలముగానున్న కోర్టుభవనమంతయు నిశ్శబ్దము వహించెను. ప్రజలు దొంగలను చూచుటకై మిగుల ఆందోళనపడసాగిరి. హంతకుడెట్టివాడో వాని రూపమెటులుండునో యని కొందరును యితకు పూర్వమాతనిని జూచితిమని కొందరొకరితో నొకరు బలుకసాగిరి. యీ జనసమూహము సందీరీతిగా పుక్కిటి పురాణాలు హెచ్చాయెను. క్రమముగా ఠంగు, ఠంగుమని గడియా

రము పదకొండు గంటలు కొట్టెను. ప్లీడరులు వారులుతీర్చి కోర్టు యందు వారు సుఖాశీనులై యుండిరి.

రక్షకభటులు తమ అధికారి ఆజ్ఞకై యెదురు చూచుచుండిరి. మేజిస్ట్రేటుగారి మొదలగువారుండగనే ఆపాద మస్తకముగా సృంఖలాబద్ధులైన చోరుల నొక్కొక్కనిగా గొనివచ్చి అధికారుల ముందరనుంచి జాగరూకతతో సాయుధులై కావలి గాయుచుండిరి. స్మిత్తుదొరగారు, మోహనరావుగారు గోపాలరావుగారు మొదలుగాగల వారందర చ్చోటనే యుండిరి. యీ చోరులందరి నొక్కొక్కనిగా బోనెక్కించి వారికవసరమగు ప్రశ్నల కుత్తరువులు గైకొని వారికొక్కక్క సంవత్సరము కఠిన శిక్ష విధించిరి. చోరులకు శిక్ష విధించిన తరువాత వారిని గొనిపోయి జైలునందు బంధించిరి. తరువాత కొంతసేపటి కిరువురు చోరులుగొని రాబడిరి. వారు నల్లని యుడుపులను ధరించి యుండిరి. వారిరువురి హస్తములకు పాదములకుగూడా నినుప సంకెలలు వేయబడి యుండెను. వారిరువురి నడుములకు బలమగు త్రాళ్ళను గట్టబడి యుండెను. ఆత్రాళ్ళరెండు చివరలు రక్షకభటులు తమచేతులం దుంచుకొని మిగుల జాగరూకతతో నుండిరి. వారిరువురు చోరనాయకులని చెప్పకయే వారివేషములు చాటుచున్నవి.

అతడు నల్లని యుడుపులను ధరించి యుండెను. అతనిమేను చామనచాయ వర్ణముగలది. అతడు రమారమీ అయిదున్నర అడుగులకు పైగానుండెను. ఆతని మేనంతయు క్రొవ్వుచే నిండియున్నదని యాతని శరీరమందంతటను నులికలు దిరిగియున్న కండరములే చాటుచుండెను. అతని విశాలమగు వక్షస్థలము చూపరులకు మిక్కిలి భీతిగొట్టుచుండెను. తామర రేకులనుబోలు విశాల నయన ద్వయము లెర్రబారి చింతనిప్పులవలె నుండెను. అతడా జనసమూహ

ముపై తన తీక్షణదృక్కులను పరపుచుండెను. అతని సహజగంభీరత్వము, రాచకళవి గాంచినవారికి మిగుల భీతిగొల్పుచుండెను. అతడొక్కడే పదిమందిపురుషులతో పోరాడగల శక్తిసామర్థ్యములు గల్గిన వానివలె గన్పట్టుచుండెను. ఆ జనసమూహమంతయు నా భయంకరమూర్తిని గాంచి ఆశ్చర్యపడసాగిరి. స్త్రీలు, బాలురు, బాలికలు నా వింతవిగ్రహమును గాంచి భయమొందసాగిరి. తక్కిన చోరులొక్కొక్క రిరువురుపురుషులతో బోరగల శక్తిసామర్థ్యములుగల వారైయుండిరి.

అచ్చటనున్న జనసమూహమంతయు నాతని కెట్టి శిక్షవిధింతురోయని మిగుల ఆందోళనపడసాగిరి.

తరువాత నొకస్త్రీని గొనివచ్చిరి. యీమె తక్కినచోరులవలె బంధింపబడి యుండలేదు. యీమెయుంగన మిగులరూపసి. యీమె వేషము ధరించిన యుడుపులు వింతగానుండెను. యీమె ధరించిన యుడుపులనుబట్టి యీమె యొక పార్శీయువతియని గుర్తించుటకు సాధ్యమగుచుండెను. యీమె రమారమి పదునారువత్సరముల ప్రాయముగలది. యీమె యేదేశస్థురాలో గూడా నా జనసమూహము యెరుగజాలకుండిరి. అంత కొంతసేపటికి కాబాలికను మెజిస్ట్రేటుగారిట్లు ప్రశ్నింపసాగిరి.

మెజి: అమ్మా! నీపేరు హేమలతకాదా? నిన్నేగదా యీచోరులు మత్తుమందొసంగి గొనిపోయినది.

హేమ: అవును. నన్నే యీ చోరులు మత్తుమందు ప్రయోగమొనర్చి గొనిపోయి బంధించిరి. నన్ను నాయకుని సేవకున కొసంగి పరిణయమొనర్పదలంచియుండిరి. వారు నన్ను సదా సేవకుని వివాహమాడమని మిగుల బాధింప మొదలిడిరి. యిటులుండగా నొకనాడు దయామయులగు మోహనరావు

గారు నన్ను చోరులబారినుండి విముక్తురాలను గావించిగొని వచ్చి తన యింటియందుంచుకొని మిగుల గారాబముతో పెంచుచుండిరి.

మె: సరే నీవు వెళ్ళవచ్చును. నీ వాఙ్మూలమిం కనవసరములేదు.

అని మెజిస్ట్రేటుగారు హేమలతను పంపివైచి చోరనాయకుని బోనెక్కించిరి.

మె: నీ పేరు కమలగదా? నీవేగదా విజయనగరము నందధిక సిరుల తో నలరారుచున్న నీలకంఠరావుగారి ఏకపుత్రికవుగదా?

కమల: అవును.

అని తలపైనున్న పాగ తీసి వేసినది. ఆమె వయస్సు సుమా రిరువది వత్సరములుండును. ఆమె యసమాన సౌందర్యవతి. పురుష రూపమున నున్నపుడు స్త్రీల మోహింపజేసినది కాని యిపుడు పురుషుల మోహింప జేయుచున్న అత్యంత నవనాగరికు రాలివలె కనబడు చున్నది. ఆమెను జూచి జడ్జి మరల యిట్లు ప్రశ్నించెను.

జడ్జి: విజయ నగరమున కాలు చేతులు నరుక బడిన మొండె మెవరిది.

కమల: అది నా దాసి.

జడ్జి: దాని నట్లేల చేసితిరి?

కమల: నా పలాయనమున కాటంకము కలుగ జేయుట చేత.

జడ్జి: విజయనగర దివాణమునందలి కారపహరించిన దెవరు?

కమల: యీతడు.

జడ్జి: చోరీయో.

కమల: అదియూ నితడూ నేనునూ కలసి చేసితిమి.

జడ్జి: యీ ధనమంతయూ నేమి చేసితిరి.

కమల: బీదలకు దానధర్మము లొనర్చితిమి.

మెజి: యింతమందిని చంపుటకు గల కారణమేమి?

కమల: అన్యాయముగా మమ్ములను పట్టుటకు ప్రయత్నించుటయే యిన్నిప్రాణములు దీయుటకుగల హేతువు. వారు కొట్టుటలో దెబ్బలుదగిలి చనిపోయినవారు కొందరుండిరి.

మెజిస్ట్రేటుగారు కమలను బోనుపైనుండి దింపించి నాయకుని బో నెక్కించిరి.

మెజి: నీ అసలుపేరేమిటి?

హాం: అసలు నాపేరు శివరావు.

మెజి: నీకు పచ్చబొట్టను పేరెట్లు వచ్చెను.

హాం: నేను బర్మాదేశమున కొకసారి వెళ్ళియుంటిని. అచ్చట కొంత మంది బైరాగులతో స్నేహమొనర్చి వారిమతమునందు కొన్నిదినములు శిష్యునిగా యుంటిని. వారివద్ద యొకవిధమగు పచ్చయుండెను. ఆపచ్చ వేసుకొనినవారికి పాముగాని తేలుగాని కరచినయెడల విషమెక్కకుండాయుండెను. అదియునుగాక కత్రదెబ్బలు తగిలినయెడల మాకు బాధ గలుగకుండా మా గురువుగారు నాకు ఒకపచ్చ వేసిరి. దానిసహాయమున యిన్నిదినములు మీతో ధైర్యముగా పోరాడగల్గితిని. శివరావనుపేరు వుత్తరములందు వ్రాసినయెడల మీరు నన్ను గుర్తింపగలరనియు పచ్చబొట్టుఅని వ్రాసి మిమ్ములనందరిని కండ్లలో దుమ్ముకొట్టి మోసగించుచూ వచ్చితిని.

మెజి: సరియే ధైర్యసాహసములకు మెచ్చితిని. గాని మీరుచేసిన నేరములు పెద్దవగుటచే మీకు ద్వీపాంతరవాస శిక్ష విధింపబడినది.

హాం: ఓహోహో యిదియా మీ వెర్రియూహ! మీరు మమ్ములను ప్రాణములతో అండమానుదీవుల కంపజాలరు అనుచూ నా

యిరువురూ వారి యంగుళీయకమునందు ఖచితమైయున్న వజ్రపు పొడులను మింగి అవనిపైబడి అసువులను బాసిరి. వారి ధైర్యమునకును, దానశీలతకును పౌరులు మిగులగొని యాడిరి. వారి మరణవార్తవిని పౌరులు విచారగ్రస్తులై యుండిరి. యీ కేసునందు సాయశక్తుల కాయకష్టపడి పని చేసినవారు తగు బహుమానములు పోలీసుశాఖాధికారిచే బడసి మిగుల ఆనందము చెందిరి.



## వివాహము



కలకత్తానగరమందలి హారిసన్ రోడ్డంతయు మంగళతూర్య ఘోషణములచే నిండియుండెను. పట్టణమందంతటను పెద్ద పెద్ద పందిళ్లు వేయబడియుండెను. ప్రతియింటిముంగలి భాగమునందు అరటి చెట్లను నాటించి పచ్చని మామిడాకుల తోరణములు గట్టి వీధులందు అత్తరు పన్నీరు జల్లిరి.

రాజబాట కిరుపార్శ్వములందు చిత్రవిచిత్రములగు కాగితములచేతను విద్యుల్లతా బుడ్లచే నలంకరింపబడి మిగుల మనోహరముగా నుండెను. రోడ్లపై జల్లబడిన అత్తరు, పన్నీరు వాసనలు పురమంతయు నిండిపోయెను.

ఒకచోట అనేకవిధములగు మందుగుండు సామానులుంచబడియుండెను. ముహూర్తమాసన్నమైన వెంటనే వాటిని వెలిగించుటకై నియమింపబడిన కూలివాండ్రు తొందరపడ సాగిరి. ఆయింటి

యుండున్న రేడియో మనోహరముగా బాడుచుండెను. అచ్చటచ్చట పురమునందు హరికథలు నాటకములు ఉచితార్థముగా ప్రదర్శింప బడుచుండెను. ఒకచోట పేదవారికి క్రొత్తవస్త్రములొసంగ బడుచుం డెను. బ్రాహ్మణుల మూకలకు మేరయే లేకుండెను. వారు తమ తమ సంభావనలనుగొని గృహాభిముఖులై చనుచుండిరి. యెచ్చట జూచినను విందులే జరుగుచుండెను. లగ్నసమయము సమీపించు టచే వధూవరు లలంకరింపబడి పెండ్లిపీటలపై కూర్చొని యుండిరి. చదువరీ! వధూవరు లెవరనుగారు. మోహనరావుగారిచే రక్షింప బడిన పార్సీయువతియగు హేమలతను మోహనుని ధైర్యశౌర్యము లకు బహుమానముగా నాతని కొసంగి పెండ్లిచేయుచుండిరి. దంప తులు విలువగల దుస్తులను నవరత్నఖచితములగు సువర్ణ ఆభరణ ములను ధరించి మిగుల మనోహరముగా గన్పట్టుచుండిరి.

పిన్నలు, పెద్దలు, ధనికులు, పేదలు, బాలురు, వృద్ధులు మొదలుగాగల వారందరా వివాహమునకు విచ్చేసి యుండిరి. వివా హము మిగుల జయప్రదముగా జరుగుచుండెను. ఒకమూల సానిమే ళములు ఒకప్రక్క సంగీతము, మధ్యభాగమునం దానందకరమైన రేడియో పాటయు వినవచ్చుచుండెను. పెండ్లిపందిరంతయు పచ్చని తోరణములతోడను, మంచి ముత్యములతోడను మంగళప్రదము గాను మనోహరముగా నలంకరింపబడి యుండెను. తరువాత వధూవ రులకు మధుపర్కము లొసంగబడెను. మధుపర్కధారణా నంతరము లగ్న మాసన్నమగుటచే పౌరోహితుడు వధువునకు మోహనరావు గారిచే మంగళసూత్ర మలంకరింపజేసెను. మంగళసూత్రధారణ సమ యమునం దచ్చటి పౌరులందరు నా నూతనదంపతులపై నక్షతలు వేయుచూ నాశీర్వదింపసాగిరి. భట్టువాండ్ర పొగడ్తలకు మేర లేకుం డెను.

మంగళ సూత్రధారణానంతరము కట్నములు చదివింపబడెను కొందరు స్వర్ణపాత్రములు వజ్రవైడూర్యములు వస్త్రములు ధనము వారి, శక్తుల ననుసరించి దంపతుల కిచ్చిరి. పౌరులందరొసంగిరి. వధూవరులు తమ ఆత్మబంధులకును నౌకరులకును, రక్షక భటులకును వారి వారి స్థితులననుసరించి మిగుల విలువగల వస్త్రములను బహుమానములను ఒసంగిరి.

వివాహానంతరము విందులు అల్పాహారవిందులు మహావైభవముగా జరిగెను. కంకణములనాటి రాత్రియందు వధూవరులొక అందమగు గదియందుంచ బడిరి. ఆ గదియు మిగుల మనోహరము. పాశ్చాత్య యువతుల చిత్రములతోడను అందమగు సోఫాలతోడ నలంకరింపబడి యుండెను. ఆగదియందు నాలుగు మూలలందు నాలుగు నిలువుటద్దములుంచ బడియుండెను. మధ్యభాగమందొక పందిలి మంచము దానిపై ముఖమల్ పరుపువింద్లు వేయబడి యుండెను. ఆగదియందు విద్యుద్దీపములు వెలుగుచుండెను. మధ్యభాగమునందు పంఖాలు విష్ణుచక్రమువలె తిరుగుచుండెను. పెండ్లికూతురును పేరంటాండ్రు గొనివచ్చి ఆగదియందొక కుర్చీపై నాశీనురాలనుగావించిరి. తరువాత స్త్రీలందరు మంగళహారతులనుపాడి తమకు మోహనరావొసంగిన బహుమతులను నారికేళములను గైకొనిరి.

హేమలతయు నా పేరంటాండ్రకు ఆకులు, చెక్కలు, కొబ్బరికాయలు బహూకరించెను. బహుమానములను పొంది యా నూతన దంపతుల నాశీర్వదించి ఆ గదినిపీడి ఆవలికేగిరి. అంతలో నొక పెనుగాలి వీచుటచే నా గదిద్వారములు తమంతటతామే బంధింపబడెను.

యీరీతిగా కొంతకాలము గడచిన దనుక మోహనరావునకు సకాలమందొక పుత్రుడు జన్మించెను. ఆదంపతులా శిసువునకు చంద్రశేఖరుడను పేరుపెట్టి మిగుల గారాబముతో నాశిసువును పెంచు

చుండిరి. ఆబాలుడును బాలచంద్రునిమాడ్కి క్రమముగా పెరుగుచుండెను.

అయిదు సంవత్సరములు వయస్సువచ్చు సరికా బాలు నా జననీ జనకులు పాఠశాలయందు ప్రవేశమొనర్చిరి. ఒక్కడే కుమారుం డగుటచే నాజననీ జనకులు మిగుల గారాబముతో పెంచుకొను చుండిరి.

